31-1-1992 శుక్రవారం 10 పేజీలు సంపుటి :63 సంచిక :5 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



# పిసిసిని పి.వి. నానేసి పోయాడు!

పిసిసి ఎన్నిక మళ్లీ సమస్యలో పడింది. ఒక పథకం ప్రకారం జిల్లా కమిటీల ఎన్నికలను తనకనుకూలంగా జరిపించుకొని, మళ్ళీ పీఠం అధిష్టించడానికి సర్వ సన్నాహాలు చేసుకొని వుండిన హనుమంతరావుకు గుండెల్లో రాయి పడింది. ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ఏ విషయమూ చెప్పకుండా నానవేసి విదేశాలకు వెళ్లిపోయారు. 4 తేది వరకు ఆయన తిరిగి రారు. అప్పటి వరకు అందరిలోనూ సస్పెన్స్ తప్పదు. జనార్దన రెడ్డి, హనుమంతరావుల ఢిల్లీ యాత్ర నిష్ఫలం అయింది. పోయిరావడం తప్ప సాధించిందేమీ లేదు.

జిల్లా కమిటీ అధ్యక్ష ఎన్నికలలో హనుమంతరావుది పై చేయి కావడం ముఖ్యమంత్రికి చికాకు కల్గించే సమస్య. కమిటీల ఎన్నికలన్నీ ముఖ్యమంత్రి ప్రమేయం లేకుండానే జరిగిపోయాయి. ఎన్నికనేది పేరుకే. హనుమంతరావు ఒక పథకం ప్రకారం సభ్యత్వాలను చేర్పించి, ఎన్నిక జరిగిపోయనట్లు ప్రకటించేశాడు. ఎక్కడా ఓటింగ్ జరిగినట్లు తెలియరాలేదు. పిసిసికి ఎన్నికైన అధ్యక్షుడుగా వుంటే, రేపెప్పుడైనా ముఖ్యమంత్రి పీఠం ఖాళీ అయితే తనకు ఛాన్సు దొరుకుతుందన్నది ఆయన ఆశ. తాత పోతే బొంత నాది అన్నట్లు ఎదురు చూస్తున్నాడాయన. అయితే ఆయన్ను కాని, ఆయన ప్రయత్నాలను కాని ఎవరూ సీరియస్‌గా తీసుకోలేదు; తీసుకోరు కూడా ! కాని, ఎన్నికైన పిసిసి అధ్యక్షుడుగా కొనసాగితే ప్రభుత్వ నిర్వహణలో ముఖ్యమంత్రి పలు చికాకులు ఎదుర్కోవలసి వస్తుంది. హనుమంతరావు మనస్తత్వం తెలిసిన వారెవరైనా ఆ పరిస్థితి ఎట్లా వుంటుందో ఊహించుకోగలరు. అందు వల్లే కొత్త పిసిసి నేతగా తన కనుకూలమైన వారిని నియమింప జేసుకోవాలని ముఖ్యమంత్రి ప్రయత్నం. అది ఎంత వరకు నెరవేరుతుందో వివరి తెలియాలి!

* * *

సహకార ఎన్నికల్లో కాంగ్రెస్ విజయ దుందుభి మ్రోగించింది. ప్రతి జిల్లాలోనూ సొసైటీ స్థాయిలో కాంగ్రెస్ అభ్యర్థులు అధిక సంఖ్యలో గెలుపొందారు. ఇది ముఖ్యమంత్రికి వ్యక్తిగత విజయం. సబ్సిడి బియ్యం, విద్యుత్ ఛార్జీల రేట్లు పెంచడం వల్ల గ్రామ ప్రాంతాలలో కాంగ్రెస్ ప్రభుత్వం పట్ల వ్యతిరేకత పెల్లుబుకుతున్నదని ప్రతిపక్షాలు చేసిన, చేస్తున్న ఆందోళన వట్టిదేనని ఈ ఎన్నికలు రుజువు చేశాయి.

ఈ రెండు రేట్ల పెంపును ప్రజలు అంత తీవ్రంగా పరిగణించలేదు.; ప్రభుత్వం పట్ల అయిష్టత ప్రకటించలేదనడానికి గుర్తుగా ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ విజయం సాధించింది. నక్సలైట్ల ప్రాబల్యం తీవ్రంగా వున్న తెలంగాణా జిల్లాలలో సైతం కాంగ్రెస్ అభ్యర్థులు గెలుపుపొందడం ఆశ్చర్య పడిపోవలసిన పరిణామం క్రింద లెక్క.

* * *

సహకార ఎన్నికల గెలుపు ఇచ్చిన ఉత్సాహంతో పంచాయితీ ఎన్నికలు

కొరవ 6 పేజీలో

## దొంగ సర్టిఫికేట్ల గోల- సిఫారసుల న్యూసెన్సు !

గ్రామాధికారుల నియామకం కలెక్టరాది అధికారులకు పెద్ద తలనొప్పిగా తయారైంది. ప్రభుత్వం పెట్టిన నిబంధనలు ఒక ప్రక్క, ఎమ్మెల్యేలు, మంత్రుల నుంచి దూకుతున్న సిఫార్సుల వత్తిడులు ఒక ప్రక్క అధికారులను తికమక పెడుతున్నాయి. ఉన్న పోస్టులు 786; వచ్చిన దరఖాస్తులు పద్నాలుగు వందల చిల్లర. రెండు మూడు గ్రామాలకు పెట్టిన దరఖాస్తులను తీసివేసినా, దాదాపు వెయ్యి మంది నికర అభ్యర్థులున్నారు. వీరందరూ మాజీ కరణాలు, మునసబులే ! వారికి ఇది చిట్టచివరి ఉద్యోగావకాశం. ఈ అదునుతప్పితే, ఇక జీవితకాలంలో ఉద్యోగాలు వచ్చేందుకు అవకాశం లేదు. అందు వల్ల దొరికిన ప్రతి గడ్డిపోచనూ పట్టుకొని ప్రయత్నం చేస్తున్నారు. కన్పడిన వారినందరినీ ప్రాధేయపడి సిఫార్సులు చేయిస్తున్నారు. ఎమ్మెల్యేలు,

### గ్రామాధికార్ల నియామకంలో గొడవలు

మంత్రి, కొన్ని కేసుల్లో బిగ్‌బాస్ నుంచి సైతం వచ్చిన 'ఉత్తరం' దిక్కు చూడవలసి వస్తున్నది అధికారులకు.

నెల్లూరు, కావలి డివిజన్‌కు సంబంధించి జాయింట్ కలెక్టర్ శ్రీ ఆర్. సాంబశివరావు గూడూరు డివిజన్‌కు సంబంధించి డిఓ శ్రీ సతీష్ చంద్ర ఇంటర్వ్యూలు జరిపించారు. మూడు డివిజన్లకు మూడంటే మూడు రోజుల్లో ఆ తతంగం పూర్తయిపోయింది. వచ్చిన దరఖాస్తులన్నీ కంప్యూటర్‌కు ఎక్కించి, ఆయా అభ్యర్థుల గత చరిత్రలనూ అందులో పొందుపరచి పెద్ద చిట్టా తయారు చేయడంతో ఇంటర్వ్యూ సులభంగా జరిగిపోయింది. గతంలో విలేజి అసిస్టెంటు ఉద్యోగాలకు అభ్యర్థులు పెట్టిన సర్టిఫికెట్లు, ఇప్పుడు సమర్పించిన సర్టిఫికెట్లు; కరణాలు, మునసబులుగా వున్నప్పుడు సస్పెన్షన్ను

కొరవ 6 పేజీలో

# అవినీతే నేటి నీతి!

స్వాతంత్ర్య యోధుడు, ఒకప్పుడు గుంటూరు జిల్లా కాంగ్రెస్ ప్రముఖుడు, మద్రాసు ఆంధ్రలలో మంత్రిత్వం నెరపిన అనుభవశాలి, వయోవృద్ధుడు కల్లూరి చంద్రమౌళి కీర్తిశేషులయ్యారు. చంద్రమౌళి గారు



పాతికేళ్ళకు పై నుండి అజ్ఞాతంలో వున్నారు. అందువల్ల ఈ యువతరం ఆయన పేరు కూడా వినివుండదు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో చంద్రమౌళి గారు స్థానిక సంస్థల మంత్రి; ముఖ్యమంత్రి ఓమందూరు రామస్వామి రెడ్డియార్. హోం శాఖను నిర్వహించేవారు; ఆ శాఖ కార్యదర్శి శ్రీ ఒ. పుల్లారెడ్డి. అప్పుడు చెప్పుకునే వారు స్థానిక సంస్థలలోని ఉద్యోగాలన్నీ ఒక కులం వారికి, పోలీస్ శాఖలో వున్న ఉద్యోగాలన్నీ మరో కులం వారికి దత్తం

## నాటి జ్ఞాపకాలు నేటి అనుభవాలు

అయ్యేవని ఆలజడిగా వుండేది. ఆ విధంగా ఆ రోజుల్లో చంద్రమౌళి గారు ఒక ప్రధాన కులానికి ప్రతినిధిగా వుండేవారన్నమాట.

ఆ సమయంలో "జమీన్‌రైతు"లో "గుంటూరు – గుండ్ల కమ్మ రాజకీయాలు" శీర్షిక క్రింద, గుంటూరు జిల్లా రాజకీయాలు చర్చించబడేవి. ఒంగోలు కూడా అప్పుడు గుంటూరు జిల్లాలోనే వుండింది. ఆ శీర్షికను స్వర్గీయ కొసరాజు అమ్మయ్యగారు నిర్వహించే వారు. ఆయన రంగాగారి అనుచరుడు. ఆ శీర్షికలోని వ్యాఖ్యలు విమర్శలు అత్యంత ఘాటుగాను, తత్సంబంధికులను, కులంతో పొడిచినట్లుగానూ వుండేవి. చంద్రమౌళి గారు ఈ విమర్శలను తట్టుకోలేని తన అనుచరుల ఒత్తిడి వల్లనేమో, రామానాయుడుగారిని తీసుక రమ్మని మద్రాసు నుండి ప్రత్యేకంగా మనిషిని పంపారు. నాయుడు గారు పోయి వచ్చారు. కాని ఆ శీర్షిక మాత్రం తర్వాత కూడా కొనసాగింది.

ఎ.సి.సుబ్బారెడ్డి గారు రాజకీయ వెలుగులో వున్న సమయంలో కీలకమైన పిసిసి సమావేశం ఒకటి నెల్లూరులో జరిగింది. నీలం సంజీవరెడ్డి గారు మొదలు రాష్ట్ర కాంగ్రెస్ అగ్ర నాయకులందరూ నెల్లూరుకు వచ్చారు. అప్పుడు ఆ సమావేశానికి వచ్చిన నాయకులందరూ జమీన్‌రైతు కార్యాలయానికి వచ్చారు గాని, చంద్రమౌళి గారు మాత్రం రాలేదు. ఆ రోజుల్లో అంత ప్రాభవంలో వుండిన చంద్రమౌళి గారు రాజకీయ పరిత్యాగియై అజ్ఞాతం గానే అస్తమించారు.

చంద్రమౌళి గారి జీవితంలో చెప్పుకోదగింది, ఆయన చేసిన పనుల్లో కలకాలం నిలిచి పోయేది భద్రాద్రి రామాలయ పునర్నిర్మాణం. ఆ రామదాసు కట్టించిన ఆలయం సాదాగా వుండేది. ఈ రామదాసు చంద్రమౌళి నిర్మింప జేసింది దృఢత్వంలోనే కాదు; కళాత్మకంగా కూడా ఎన్నదగినది. ఆ రామదాసు కథలు మనం విన్నాము; కాని ఆయన్ను మనం చూడలేదు. మనం ప్రత్యక్షంగా చూచిన రామదాసు ఈయన. ఆ రామదాసు వలె ప్రభుత్వధనాన్ని దుర్వినియోగం చేసి జైలుపాలై నానా హింసలకు గురియై, ఆఖరుకు తన రక్షణకు రాలేదని రాముణ్ణి చీవాట్లు పెట్టాడు. ఈ రామదాసు ఆలయ పునర్నిర్మాణంలో మార్పులు చేర్పుల విషయంలో మొదట వివాదాస్పదుడైనా, తర్వాత ఆగమ శాస్త్రజ్ఞుల సలహాను పాటించుట ద్వారాను ప్రభుత్వ–ప్రజల

కొరవ 8 పేజీలో

# కాంగ్రెస్‌కు నామినేషన్ల శక్తి కాదు- ఆరోగ్యకరమైన బలం కావాలి!

## ఆరోగ్యకరమైన బలుపు కావాలి !

సహకార ఎన్నికల్లో జిల్లాలో కాంగ్రెస్ విజయ దుందుభి మ్రోగిస్తున్నది; దాదాపు మూడింట రెండు వంతుల సొసైటీలు హస్తగతమైన తర్వాత విజయ ఢంకా మ్రోత మోగి తీరుతుంది కదా ! మన జిల్లాలోనే కాదు, రాష్ట్ర వ్యాప్తంగా పరిస్థితి ఈ విధంగానే వుండవచ్చు. ఇప్పటి మనుషులలో అధిక సంఖ్యాకులు అధికారం చుట్టూ పరిభ్రమించేవారే. ఇప్పుడు అధికారంలో వుండేది కాంగ్రెస్ కాబట్టి సహజంగా ఇటువంటి ఎన్నికలలో విజయం అధికారపార్టీదే అవుతుంది. ఆ కీర్తి, ఖ్యాతి అధికారంలో వున్న నాయకుడికి దక్కుతుంది. ముఖ్య మంత్రిగా సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకోవడానికి, విధానాలు అమలు పరచడానికి శ్రీ జనార్ధనరెడ్డికి ఈ సహకార ఎన్నికల విజయం మరింత బలాన్ని చేకూరుస్తుంది.

ఎన్నికలు పార్టీపరంగా జరుగలేదు; పార్టీ ఏదైనా స్థానిక సమస్యలు, సంబంధాలు వ్యక్తులు వర్గాలు ప్రాధాన్యత వహిస్తాయి కాబట్టి, సొసైటీల స్వరూపం పార్టీల కతీతమైన కలగూరగంపగా వుంటుంది. ఏ సొసైటి ఏ పార్టీకి చెందినదో తెలుసుకోలేనట్లుగా వుంది వాటి స్వరూపం. లాలూచీలు రాజీలు అవకాశ వాదంగా సమయానుకూలంగా జరిగిపోయాయి. ఎన్ని వంకలు తిరిగితేనేమి,కావడి సురక్షితంగా ఇంటికి చేరడం ప్రధాన మన్నట్లుగా, పార్టీ ఏదైతే నేమి సొసైటీలు చేజిక్కడంతో ముఖ్యమంత్రి సంతోషపడి వుంటారు. రాజకీయాల్లో కావలసింది ఫలితమే గాని, ఆ ఫలితాన్ని పొందుటకు అనుసరించిన మార్గం కాదు గదా !

రాష్ట్ర వ్యాప్తంగా, ముఖ్యంగా జిల్లాలో సహకార రంగాన్ని పట్టుకో గలగడం ప్రశంసనీయమే. కాని నిష్టురమైనా, వ్యతిరేకత కొని తెచ్చుకోవడమైనా, ఒట్లు పోగొట్టు కోవలసి రావడమైనా పార్టీ బలహీనపడే ప్రమాదమున్నా ఆర్థిక విధానాలకు సంబంధించి కఠినమైన నిర్ణయాలు తీసుకుంటున్నది ప్రభుత్వం. కేంద్ర ప్రభుత్వం సంగతెందుకు, బియ్యం సబ్సిడీ విషయంలో పార్టీ లోపల, వెలుపల ఎంత వ్యతిరేకత వున్నా ముఖ్యమంత్రి జనార్ధన రెడ్డి వెరపు లేకుండా సముచితమైన నిర్ణయం తీసుకోగలిగారు; అందరి ప్రశంసలకు పాత్రమైనారు. దేశం ఆర్థికంగా బలాన్ని పుంజుకోవడానికి ఏ విధంగా నిర్ణయాలు తీసుకుంటున్నారో, అట్లే కాంగ్రెస్ పార్టీ పూర్వపు ఔన్నత్యం కోసం ఎందుకు చర్యలు తీసుకోకూడదు?

పరిపాలనలో ఆదర్శ వంతమైన ప్రమాణాలను ఎందుకు పాటించకూడదు? ప్రజాస్వామ్య ఎన్నికల పవిత్రత ఎందుకు కాపాడకూడదు? ఇతర పార్టీలకు ఎందుకు మార్గదర్శకం కాకూడదు?

తాజా సమస్య కాబట్టి సహకార ఎన్నికలనే తీసుకోండి. ప్రతి సొసైటీలో ఇద్దరు మహిళలకు ప్రాతినిధ్యం కల్గించారు. స్త్రీలకు సముచిత స్థానం ఇచ్చారు; దాదాపు జనాభాలో సగం వున్న స్త్రీలకు ఇంకా ఎక్కువ దామాషా ప్రాతినిధ్యం పొందడానికి కూడా హక్కు వుంది. సహకార రంగంలో స్త్రీల సహకారానికి అవకాశ మిచ్చినందుకు ప్రభుత్వాన్ని అభినందించాలి. కాని పదకొండు మంది సభ్యులు ఎన్నిక ద్వారా వచ్చినపుడు, మహిళా సభ్యులిద్దరు మాత్రం ఆ విధానంలోనే వచ్చే అవకాశం ఎందుకు కల్పించ

## పినాకిని తీరం

కూడదు?నామినేషన్లంటే అధికారంలో వున్న పార్టీకే గాదు, ఆ వర్గానికి చెందిన వారు తప్ప మరొకరు వచ్చే అవకాశం లేదు. నామినేషన్‌లతో లభించే విజయం నిజమైన విజయం కాదు. ఎన్నిక ద్వారా కలిగిన విజయమే నిజమైన విజయం. ఎన్నిక విజయం బలుపు అవుతుంది; నామినేషన్ గెలుపు వాపుతోనో, నీరుతోనో సమానం ; కాంగ్రెస్‌కు నామినేషన్ల వంటి టానిక్కుల శక్తి కాదు –ఆరోగ్యకరమైన బలం కావాలి; అది సహజ ప్రాణ వాయువుతో బ్రతక గలగాలి– కృత్రిమమైన ఆక్సిజన్‌తో కాదు!

# మేనకూరు అభ్యర్థిత్వంలో ఏదో ఎవరిదో చాణక్యం వుంది!

## ఎవరిదీ చాణక్యం ?

## ఎవరీ చాణక్యుడు ?

కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్ష అభ్యర్థిత్వానికి ఒక కొత్త పేరు హఠాత్తుగా తెర మీదకు తేబడింది. కలలో కూడా వూహించని పేరది. రాజకీయ వాసన, పదవుల పిచ్చి – నాకు తెలిసి – లేని వ్యక్తి అతను. అటువంటి వ్యక్తిని రంగప్రవేశం చేయిస్తున్నారంటే బరిలోకి తెస్తున్నారంటే అందులో ఏదో రాజకీయముంది; వ్యూహముంది; కుయుక్తి వుంది. అట్లా అనుకోవడం పొరపాటు కాదనుకుంటాను.

శ్రీ మేనకూరు శ్రీనివాసులు రెడ్డి విద్యావంతుడు; ఖద్దరు గోత్రీకుడు; కల్లకపటం లేని వాడు; డబ్బు పెత్తనంలో అనుభవజ్ఞుడు; పొరపాటున కూడా చిల్లి గవ్వ చేజారకుండా చూచుకునే ఘటికుడు. బంధు రీత్యా చెప్పాలంటే డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారి మేనల్లుడు; శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారి వడ్డకుడు; శ్రీ మేగొటి పినతండ్రి కుమారుడు అంటే నికార్సయిన కాంగ్రెస్ కుటుంబీకుడన్నమాట.

శ్రీనివాసులు రెడ్డి అర్హత లేని వాడు కాదు. కాని బుచ్చిరెడ్డిపాళెం హద్దులు దాటని వాడు ; రాజకీయాలలో గాని, ప్రజాసేవా రంగంలో గాని వున్నవాడు కాని కాదు. అసలు ఇటువంటి పదవులు హోదాలు ఆశించే వాడు కాదు, ఎవర్నీ అడిగేవాడు కాదు. నిరాడంబరంగా, నిశ్శబ్దంగా, అజ్ఞాతంగా వుండే శ్రీనివాసులు రెడ్డి పేరు ఎవరు ఎందుకు బయటకు లాగారు? అంతరంగికోద్దేశ్యమేమి? అందులో నల్లపరెడ్డివారి సమర్థనను సంపాదించవలసిన అవసరం ఏమి కలిగింది? ఎవరి మేధస్సు నుండి వెలువడిన ప్రతిపాదన ఇది ? దీని వెనుక ఎవరో చాణక్యుడున్నారు, అందులో ఏదో చాణక్యమంది; సందేహం లేదు! మేనకూరు శ్రీనివాసులు రెడ్డివంటి మంచి వ్యక్తిని ఈ రొంపిలోకి దింపడం మాత్రం సమంజసంగా లేదు. ఏదోలేపి వదలడం తప్ప, కలిబెట్టకుండా వుండలేక పోవడం తప్ప ఇది జరిగేది కాదు, నెరవేరేది కాదు.

ప్రస్తుత పరిస్థితుల్లో ముఖ్య మంత్రి నిర్ణయించిన అభ్యర్థి తప్ప మరొకరికి అవకాశముండదు. ఇప్పుడు ముఖ్యమంత్రిని కాదని పోయే వారూ వుండరు. అటువంటప్పుడు ఈ తురుపు ముక్క వేయడం వెర్రి పడడానికి తప్ప ఎందుకు?

NDU

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ.75/-
అర్ధ సంవత్సర చందా రూ. 40
విడిప్రతి 1.50

# జమీన్‌రైతు

## అవాంఛనీయం

కేంద్ర మంత్రులలో ప్రభుత్వ విధానాలపై అభిప్రాయ భేదాలు ఏర్పడుతున్నట్లు కన్పడుతున్నది. అభిప్రాయ భేదం అనేది ప్రజాస్వామ్య సంస్థల మనుగడకు ప్రాణ వాయువు వంటిది. విధానాలపై విరుద్ధ అభిప్రాయాలు వెల్లడై, చర్చకు వచ్చినపుడే ఆ విధానాలు మరింత సంపూర్ణత్వం సిద్ధించుకోగల్గుతాయి. విభిన్న అభిప్రాయాలకు ఆస్కారం లేని పరిస్థితి నియంతృత్వానికి దారి తీస్తుంది. అయితే అభిప్రాయభేదాలు, వాటి పై చర్చలు, వాదోపవాదాలు అంతర్గతంగా వున్నప్పుడే ప్రజాస్వామ్యానికి ఆరోగ్యం; అవి బట్టబయలైతే పరిణామాలు దారుణంగా వుంటాయి. ఇప్పుడు కేంద్రంలో జరుగుతున్నదిదే !

స్వతంత్ర భారతచరిత్రలో తొలిసారిగా శ్రీ పి.వి. నరసింహారావు కేంద్రప్రభుత్వ నిర్వహణలో విప్లవాత్మక మార్పులు తీసుకవచ్చారు. ఆయన లెఫ్టకాదు, రైటు కాదు, మధ్యేవాది అసలే కాదు. ఎటువంటి సిద్ధాంత రాద్ధాంతాలలోనూ ఆయన ఇరుక్కోలేదు. అధికారం పోతుందనే భయం లేదు. అధికారాన్ని కొనసాగించుకోవాలన్న తపన లేదు. అధికారం మిధ్య అని భావించే తాత్వికునివలె వుంది పరిపాలన. అందువల్లే ఆర్థిక పరమైన సంస్కరణల విషయంలో అంత స్పీడుగా పోగల్గుతున్నాడు. కాశ్మీర్, పంజాబ్ వంటి దీర్ఘకాలిక రోగాలకు చికిత్స విషయంలోనూ ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీ, వి.పి.సింగ్‌ల వైఖరికి భిన్నంగా వున్నాయి పి.వి. నిర్ణయాలు. వాస్తవ పరిస్థితిని అంచనా వేసి, ఆచరణకు ఏది అవసరమో, ఏది సులువో ఆలోచించి దాన్ని అమలు చేసుకుంటూపోతున్నారు పి.వి.. ఇప్పుడు మన్‌మోహన్ సింగ్ చేపట్టిన సంస్కరణల కంటే మెరుగైనవి, విప్లవాత్మకమైనవి — సోషలిజం పరంగానూ, స్వేచ్ఛా మార్కెట్ పరంగానూ కూడాగతంలో ఎందరో ఆర్థిక మంత్రులు నెహ్రూ, ఇందిరాగాంధీలకు ప్రతిపాదించారు. కాని వారు అంతటి సాహసం చేయలేక పోయారు. రాజీవ్ గాంధీ కొన్నిటిని తలపెట్టినా విపరీతమైన వత్తిడులకు తట్టుకోలేక వాటిని ఉపసంహరించుకోవలసి వచ్చింది. ఇప్పుడు పి.వి. ఆ వత్తిడులను లెక్క చేయడం లేదు. అందు వల్లే మంత్రి వర్గంలో ఈ విభేదాలు.

ఆర్థిక పరమైన మార్పుల పట్ల మానవ వనరుల మంత్రి శ్రీ అర్జున్‌సింగ్ తన ఆగ్రహాన్ని బహిరంగంగా వెళ్ళగ్రక్కాడు; కాశ్మీర్‌లో ఏక్తా యాత్రపై హోం మంత్రి శ్రీ ఎస్.బి. చవాన్ అసంతృప్తి ప్రకటించాడు. పంజాబ్ ఎన్నికల తీరుపైన కొందరు మంత్రులు అయిష్టత వ్యక్తం చేశారు. కాశ్మీర్‌లో రాజేష్ పైలట్ జోక్యం వివాదాస్పదంగా మారింది. ఈ సంఘటలన్నీ పి.వి. ప్రభుత్వ స్థిరత్వం పట్ల, పి.వి. చేపట్టిన సంస్కరణల కొనసాగింపు పట్ల ప్రజలలో అపనమ్మకాలను, సందేహాలను సృష్టిస్తున్నాయి. ఆర్థికంగా, సామాజికంగా దేశం పయనిస్తున్న క్లిష్ట పరిస్థితులలో కేంద్ర ప్రభుత్వం అస్థిరత్వం పాలైనా, చేపట్టిన మార్పులు అస్తవ్యస్తమైనా దేశం ఛిన్నాభిన్నమౌతుంది; ఫలితాలు పరమ దారుణంగా వుంటాయి. మంత్రులలోనే ఐక్యత, అంగీకార భావం లేదని తెలిస్తే ప్రభుత్వ యంత్రాంగం, ముఖ్యంగా అధికారులు సంస్కరణలను నీరుగార్చేస్తారు. అటువంటి అపనమ్మక వాతావరణం విదేశీ పెట్టుబడులకు ఆటంకం అవుతుంది. కాశ్మీర్, పంజాబ్ విద్రోహులు ఆ పరిస్థితిని తమకనుకూలంగా మల్చుకుంటారు. చేసిన, చేస్తున్న కృషి సమస్తం నిర్వీర్యమౌతుంది.

మైనారిటీ ప్రభుత్వమైనా, ఆలోపం కన్పడకుండా, ఎక్కడా ఎటువంటి సంఘర్షణలకు ఆస్కారమేర్పడకుండా, ప్రతిపక్షాలన్నిటినీ కలుపుకపోతూ, ఏకాభిప్రాయంతో పరిస్థితులను ఎదుర్కొంటున్న ప్రధానికి, తన మంత్రి వర్గంలో ఐక్యత పాడు కొల్పడం పెద్ద సమస్య అవుతుందని భావించలేము. ఆ విషయం పట్ల ఆయన ఏకాగ్రత ప్రదర్శించవలసిన సమయం ఆసన్నమైంది. మంత్రులు సైతం తమ అసంతృప్తి, అయిష్టతలను బయటకు వెల్లడించకుండా, మంత్రి వర్గ సమావేశాలలోను, ముఖాముఖి చర్చల ద్వారాను సమస్యలు, అభిప్రాయభేదాలు పరిష్కరించుకోవడం అవసరం. వారు వీధులకెక్కితే వారి పదవులకే కాదు నష్టం — దేశానికే తీరని అపకారం జరుగుతుంది.

ఆర్థిక సంస్కరణలు నెహ్రూ కాలం నుంచి పాటిస్తున్న సోషలిస్టు సిద్ధాంతాలకు వ్యతిరేకమైనా — ప్రపంచంలో శరవేగంగా సంభవిస్తున్న మార్పుల పరంగా చూస్తే, దేశభవితవ్యానికి తప్పనిసరి. రష్యా అనుభవం చూసిన తర్వాతనైనా కాంగ్రెస్‌లోని సోషలిస్టులు ఈ వాస్తవాన్ని గుర్తించాలి. సిద్ధాంతాల కంటే, దేశ శ్రేయస్సు, ప్రజల ప్రగతి ముఖ్యమని గ్రహించాలి.

---

### జమీన్‌రైతు

**30.1.42**

8 పేజీలు అణా

#### క్రొత్తహాలులో గలాటా

19 తేది రాత్రి 8.30 గంటలప్పుడు నెల్లూరు కొత్తహాలులో ఆట జరుగుతూ వుండగా, పురుషులుండే చోట నీళ్ళ పాము కనపడినదనీ, బెంచీలలో కుర్చీలలో కూర్చుండిన పురుషులు గాభరాపడి స్త్రీలుండు కంపార్టుమెంటు లోకి దూకినారనీ, అచటి స్త్రీలు పురుషులు దుముకుట చూచి భయపడి పెద్ద కేకలు వేసినారనీ, హాలంతా కలవరమైందనీ రౌడీలు యధేచ్ఛగా విహరిస్తున్నా, దీపాలు వెలగలేదనీ, బొమ్మలు తిరుగుచూనే ఉండివనీ, చుట్టు ప్రక్కల వారూ, పోలీసులు పరుగెత్తి వచ్చిరనీ, హిందు స్త్రీలు ఇండ్లకు వెళ్ళిరనీ తెలుస్తున్నది.

#### గూడూరు న్యూస్‌రీల్

పాత విద్యార్థి సంఘం వారు విద్యార్థులకిస్తామన్న వేతనాలు వెంకటకృష్ణారెడ్డి గారు ఈ వారం ఇస్తానన్నందుకు వందనాలు.

* * *

[illegible] 1 గాంధీజయంతి జమా ఖర్చులు ఏవన్నా ప్రకటిస్తారా లేదా ?

#### నెల్లూరు ముచ్చట్లు

##### అర్బన్‌బ్యాంకి

అర్బన్‌బ్యాంకి ఎన్నికల్లో వి.ఆర్. హై స్కూలు టీచర్లు గాకుటూరు నరశింహారావు, వేగూరు వెంకటప్పయ్య గారలను తిరుగా డైరెక్టర్లుగా యెన్నుకోవడం మాకు సుతరాం యిష్టం లేదు. అది వ్యక్తిగత ఆక్షేపణగాదు. టీచర్లు ఇతర గొడవల్లో తలదూర్చగూడదనే మా పాత యభిప్రాయం మారలేదు.

##### బాల గజదొంగ

తోటపల్లిగూడూరు, పంగులూరు సుబ్బరామయ్య అనే సుమారు 15 సంవత్సరముల వయస్సుగల, బలిజ, బాల గజదొంగను నెల్లూళ్ళో

#### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

సబ్‌యిన్‌స్పెక్టర్ కన్నబాబు 25 తేది అరెస్టు చేశారు. వీడు జగ్గయ్య శెట్టి యింట్లో బంగారు గజ్జలు, రమణయ్య యింట్లో బంగారు దండ, పప్పులవీధి పెండ్లిపార్టీలో, కలెక్టరు ఆఫీసు గుమాస్తా సుబ్బరామయ్య యింట్లో దండ, ముత్తరాజా రామారావు యింట్లో లోలాకులు, వి.టి. గోపాలాచారి యింట్లో చేతి గడియారము, ఉంగా ఎన్నో — ఎన్నో — చేసిన ఘనుడట.

##### నెల్లూరు గలాటాలు మొహరం పండుగ

నెల్లూరులో పులి వేషాలకు అనుమతి యివ్వలేదని యీ సారి మొహరం పండుగ జరుపలేదు. కడపటిదినం మాత్రం సాయింత్రం 5.30 గంటలకు ఉత్సవంగా ఏటికివెళ్ళి, రాత్రి 8 గంటలకు అలీబీదా పాడుకుంటూ తిరిగి వచ్చారు. బజారునవచ్చేటప్పుడు కామాటివీధి ప్రాంతంలో రాళ్ళుపడ్డవని కలవరంకలిగింది. కొన్ని అంగళ్ళ బల్లులు, సైనుబోర్డులు, పడగొట్టబడ్డవి. పెద్ద కలవరం రేగింది కాని పోలీసువారి బందోబస్తు చక్కగా వుండినందున యేలాటితొందరలూ జరుగలేదు.

##### కత్తిపోటు

28 తేది ఉదయం 7.30 లకు సుబేదారు పేట మేదర ఇండ్లనుండి బృందావనం పొయ్యే చోట లోకల్ ఫండ్ ఇంజనీరు ఆఫీసు జవాను సయ్యద్ మహమద్ హుసేన్ అనునతని ఎవరో కత్తితో పొడిచి పారిపోయిరి. ఆసుపత్రిలోనున్నాడు. పోలీసులు వచ్చి 8 మందిని స్టేషనుకు తీసుకొని వెళ్ళి విచారించి పంపివేశిరి. ఇతను మంచి వాడు. ఇది మత సంబంధమైన ఘాత కాదని తెలుస్తుంది.

ఇతను ఆసుపత్రిలో 30 తేదిన జబ్బుగా వున్నట్లు తెలియచున్నది.

---

## ఎందుకీ ఏక్‌తా యాత్ర ?

బిజెపి అధ్యక్షుడు డాక్టర్ మురళీమనోహర్ జోషి ఏక్‌తా యాత్ర ప్రశాంతంగా ముగియడం సంతోష దాయకం. పి.వి. నరసింహారావు గారి రాజనీతిజ్ఞతే ఈ సమస్య నుంచి దేశాన్ని కాపాడింది. అద్వాని గారి అయోధ్య యాత్ర ఎంతటి విషపూరిత వాతావరణాన్ని సృష్టించిందో మనం చూశాం. వి.పి. సింగ్, ములాయం సింగ్‌ల పుణ్యమా అని అప్పుడు యావద్భారతదేశం దావాగ్నికి గురైంది; ప్రజల హృదయాలలో విషం నిండింది. ఏక్‌తాయాత్ర ద్వారా కూడా బిజెపి అదే ఆశించింది. కాని పి.వి. చతురత వల్ల అది ఫలించలేదు. చూడడానికి జోషి యాత్ర ఉద్దేశ్యం దేశభక్తి ప్రపూరితమైనది. దేశ భూభాగం పై జాతీయ జెండా ఎగురవేయడం తప్పని ఎవరూ అనలేరు. తన గడ్డ పై తన జెండా ఎగురవేసుకోలేని దయనీయ స్థితిలో వుండడం ఏ జాతికి పరువైన విషయం కాదు. కాని మతతత్వ పార్టీగా ముద్ర పడిన బిజెపి ఆ కార్యక్రమం చేపట్టే సరికి, ఆ సంకల్పమే సందేహ స్పదమై పోయింది. కాశ్మీర్‌లో జాతీయ జెండా ఎగురవేయడం ద్వారా, అక్కడ ఎటువంటి పరిస్థితులు నెలకొని వున్నాయో ప్రపంచానికి చాటి చెప్పగలిగారు జోషి.

అయితే ఈ యాత్ర వల్ల ముస్లిం మత ఛాందసులకు మత ఛాంధసత్వమే సరైన జవాబన్న భావం ప్రచారంలోకి వస్తున్నది. విచారకర పరిణామం ఇది. భారతీయ సంస్కృతికి, హిందూ మత మూఢత్వానికి లంకె పెట్టి, రెండూ ఒకటే

[illegible]

ప్రయత్నిస్తున్నారు బిజెపి నాయకులు. పరమత సహనం, లౌకిక వాదం, పునాదులుగా పరిఢవిల్లిన సంస్కృతి మనది. అక్బర్, టిప్పుసుల్తాన్ వంటి ముస్లిం రాజులు ఈనాటికీ హీరోలుగా వెలుగొందడంలోనే మన సంస్కృతి విశిష్టత వ్యక్తమౌతున్నది. ముస్లింలనుకాని, బౌద్ధులు, క్రిస్టియన్లను కానివికాలంలోనూ ఏ హిందువూ పరాయి వాడిగా చూడలేదు; వారినీ తమతో పాటు భారతీయులుగానే పరిగణించారు. హిందూ మతం, భారతీయ సంస్కృతి ఎప్పుడూ వేరు వేరుగానే వున్నాయి. ఈ వాస్తవాన్ని మరుగుపరచడానికి బిజెపి చేస్తున్న ప్రయత్నం శోచనీయమైనది. అయితే అయోధ్య రథయాత్రలు కాని, ఏక్‌తాయాత్రలు కాని తమ మనసులను మార్చలేవని వాటి చెప్పిన భారతీయులకు ప్రపంచం జేజేలు చెప్పాలి

ఆర్. సుబ్బారావు

మద్రాసు

### జిప్రప మూత్రశాల

నెల్లూరు జిల్లాప్రజాపరిషత్

కార్యాలయంలోని మూత్రశాలను కనీసం నెలకొకసారైనా శుభ్రం చేస్తారా అన్నది సందేహమే. లోపలకు తొంగి చూస్తేనే కడుపులో దేవుతుంది. ముక్కులు పగిలిపోయే దుర్గంధం. మొజాయిక్‌టైల్ ఫ్లోరింగ్‌తో అందంగా కట్టారు. కాని కనీస పాటి శ్రద్ధ చూపరు. జిల్లా ప్రధాన కార్యాలయంలోనే జిప్రప నిర్వహణ ఇంత అధ్వాన్నంగా వుండాలా ?

—సత్యకీర్తి

నెల్లూరు

### పశువుల కొట్టం పది రెట్లు మేలు

ఆత్మకూరు బస్టాండు లోని ప్రయాణీకుల వసతి గృహమన బడే పాడుబడ్డ భవనం రాను రాను దయనీయంగా తయారౌతూంది. లోపల కడుగు పెడితే ముక్కులు పగిలే కంపు. ఎప్పుడూ, ఎవరూ చిమ్మిన పాపాన పోయినట్లు లేదు. యాచకులకు అదే స్థిర నివాసం. వారికదే డైనింగ్ హాల్ కం యూరినల్స్ అన్ని పనులూ అక్కడే

కొరవ 6 పేజిలో

వరికి చీడల పీడ పోతుంది; పప్పుధాన్యాల కొరత తీరుతుంది

# అపరాల సాగు అన్ని విధాలా మేలు !

పప్పు ధాన్యాలలో పోషక విలువలైన మాంసకృతులు, ఖనిజ లవణాలు అధికంగా వుంటాయి. ప్రతి మనిషికి సగటున రోజుకు 104 గ్రా. పప్పు ధాన్యాలు అవసరమైతే ప్రస్తుతం మనకు 40 గ్రా. మాత్రమే లభ్యమవుతున్నాయి. ఈ పప్పు ధాన్యాలు కనీసం 60 గ్రా. వరకైనా అందుబాటులో వుండాలంటే, పప్పు ధాన్యాల ఉత్పత్తి కనీసం రెండు కోట్ల టన్నులకు పెంచ వలసిన అవసరముంది. ఈ పప్పుధాన్యాలు లేదా అపరాలు నేలలోని రైజోబియమ్ అనబడే సూక్ష్మజీవుల సహాయంతో వాతావరణం లోని నత్రజనిని గ్రహించి, వేరు బుడిపెలలో నిల్వచేసి పంటకు కావలసిన నత్రజనిని అందించటమే గాక, మిగిలిన నత్రజనిని భూమిలో వదలుటచే భూసారం అధికమై తదుపరి పండించే పంటలకు ఉపయుక్తకరంగా వుంటుంది. వరి తర్వాత వరి వేసి, భూసారాన్ని తగ్గిస్తూ, చీడపీడల ఉధృతికి దోహదకారి అయ్యేకన్నా రెండు వరి పంటల మధ్య అపరాలను సాగుచేయడం శ్రేయస్కరం.

వరి మాగాణి భూముల్లో మొలగొలుకుల తర్వాత అపరాలను (పెసర, మినుము) కొంత మంది రైతులు సాగుచేస్తున్నప్పటికీ ఆశించిన మేరకు హెచ్చు విస్తీర్ణంలో వీటిని సాగుచేయవలసిన అగత్యం ఏర్పడింది. జిల్లాలో ఇపుడిపుడే అపరాల విస్తీర్ణం విస్తరిస్తూ వుంది. ఈ వరి మాగాణి భూముల్లో అపరాల దిగుబడి పెంచేందుకు అధికోత్పత్తి నివ్వగల పెసర, మినుము రకాలు సాగుచేసి, అవసరమైన మేరకు సస్యరక్షణ చర్యలను చేపట్టాలి.

మన ప్రాంతానికి అనువైన రకాలను ఎంపిక చేయుటకు తగిన పరిశోధనా కార్యక్రమం చేపట్ట బడింది. పరిశోధన ఫలితాల ప్రకారం మాగాణి పొలాలకు అనువై త్వరగా అల్లుకపోయే తీగ రకాల లక్షణాలు క్రొత్త రకాలకు వుండాలి. అలా త్వరిత గతిని పెరిగి, వరి దుబ్బుల్లో త్వరగా కప్పు వేసే లక్షణం మాగాణి పొలాల్లోని అపరాల రకాలకు చాలా ముఖ్యం. మొలగొలుకుల తర్వాత వరి మాగాణుల్లో సాగుకు అనువైన రకాలు.

పెసర : యం. యల్. - 267, పూసా 105

మినుము : యల్.బి.జి - 20

వేసవిలో సాగుచేయకపోతే, వీటితో పాటు పెసరలో పి.డి.యం - 54, మినుములో పి.డి.యు - 3 రకాలను కూడా సాగుచేసుకోవచ్చు. ఈ రకాల వివరాలు క్రింద పొందుపరుస్తున్నాము.

పెసలు : యం.యల్. - 267 : ఈ రకము పంట కాలము 60-65 రోజులు. దిగుబడి హెక్టారుకు 12-15 క్వింటాళ్ళు వస్తుంది. మొక్కలు మధ్యస్థ పొడవులో నిలువుగా పెరుగుతాయి. రెమ్మలు ప్రక్కలకు

డాక్టరు పి. రాఘవ రెడ్డి
వ్యవసాయ పరిశోధనా స్థానం
నెల్లూరు

విస్తరిస్తాయి. కాయలు కాండం క్రింది భాగం నుండి పై వరకు వుంటాయి. కాయ పైరులో పైకి బాగుగా కన్పించదు. కాయలు, గింజలు చిన్నవి. గింజలు ఆకుపచ్చరంగులో మెరుస్తూ వుంటాయి. పల్లాకు తెగులును తట్టుకొంటుంది.

పూసా 105: హెక్టారుకు 12-14 క్వింటాళ్ళ దిగుబడి నివ్వగల ఈ రకము 60-65 రోజులలోనే కోతకు వస్తుంది. కాయలన్నీ ఒకే సారి కోతకు వస్తాయి. గింజలో మధ్యస్థ (సైజు) పరిమాణంలో, ఆకు పచ్చరంగుతో మెరుస్తూ వుంటాయి. పల్లాకు తెగులును, ఆకుమచ్చతెగులును ఓ మాదిరిగా తట్టుకుంటుంది.

పి.డి.యం. - 54 : పంట కాలం 60 రోజులు. ఈ రకం హెక్టారుకు దిగుబడి 14-15 క్వింటాళ్ళ నివ్వగలదు. వీటి ఎద్దడిని తట్టుకుంటుంది. పల్లాకు తెగులును ఓ మాదిరి తట్టుకుంటుంది.

మినుము : యల్.బి.జి -20 : ఈ రకము 70-75 రోజులలో పంటకు వస్తుంది. హెక్టారుకు దిగుబడి 15-16 క్వింటాళ్ళు. ఇది టి -9 రకము లాగే యుండి, కాయలు నునుపుగా, గింజలు నేత మినుములాగా, నలుపురంగులో మెరుస్తూ వుంటాయి. పల్లాకు తెగులును ఓ మాదిరిగా తట్టుకుంటుంది.

పి.డి.యు - 3 : అరవై రోజుల్లో కోతకు వచ్చే ఈ రకం హెక్టారుకు 12-14 క్వింటాళ్ళ దిగుబడి నివ్వగలదు. కాయలపై నూగు వుంటుంది. గింజలు ముదురు నలుపు రంగులో వుంటుంది

కొరవ 8 పేజీలో

## సణుగుడు

### * నేతాజీకి భారతరత్న - ఇంత కంటే అవమానం ఇంకొకటుందా?

నేతాజీ సుభాష్ చంద్రబోస్‌కు 'భారతరత్న' బిరుదు ప్రసాదించారు. సూర్యుడిని చూపించడానికి టార్చ్‌లైట్ వెలిగించిందన్నమాట కేంద్ర ప్రభుత్వం. సుభాష్ చంద్రబోస్‌ను అవమానించ డానికి ఇంత కంటే సులువైన మార్గం ఢిల్లీనేతలకు కన్పించినట్లు లేదు.

'భారతరత్న' వంటి బిరుదులతో తీర్చుకొనేదా నేతాజీ రుణం ? అది ఆయన అదృశ్యమై పోయిన యాభై ఏళ్ళ తర్వాతనా జ్ఞాపకానికి వచ్చేది ? నేతాజీ జీవితానికి, భారత జాతి చరిత్రకు గల బాంధవ్యం గుర్తించి వుంటే, ఈ దుస్సాహసం చేసి వుండేవారు కాదు. ఆధునిక భారత చరిత్రలో మహాత్మాగాంధీకి ఎంతటి సమున్నత స్థానం వుందో, నేతాజీకి అంతే వుంది. మార్గాలు వేరైనా, తమ తమ పంథాలలో జాతిని జాగృతం చేసిన మహాపురుషులు, ధన్యజీవులు వారిద్దరూ ! చరిత్ర పట్ల చారిత్రక పురుషుల పట్ల నేతలకున్న హ్రస్వదృష్టి, అవగాహనా లోపం వల్ల ప్రస్తుత తరానికి నేతాజీ పట్ల సరైన భక్తి ప్రపత్తులు ఏర్పడలేదు గాని; స్వాతంత్ర్యం కాలం నాటి, స్వాతంత్ర్యా నంతర తరంలో కూడా నేతాజీ ప్రస్తావనతోనే ఉద్వేగం ఉప్పొంగడం, నేతాజీ తలపుకు రాగానే ఒక విధమైన ఉత్సాహం ఉరకలువేయడం, సర్వసాధారణంగా జరిగేది. యువకులలో ఈ భావోద్వేగం మరీ జాస్తిగా వుండేది. నేతాజీ సాహసాలను కథలు కథలుగా చెప్పుకొనేవారు. ఈ దేశంలో గాంధీ మహాత్ముడి పట్ల అయిష్టత ప్రకటించే వారున్నారు గాని, నిందించేవారున్నారు గాని, నేతాజీని తప్పుపట్టే వ్యక్తి లేడు. ఒక అశోకుడి వలె, ఒక వివేకానందుడి వలె, ఒక వీర శివాజీ వలె నేతాజీ కూడా భారత జాతి చరిత్రలో ఎప్పటికీ చెరిగిపోని, చెదరిపోని స్థానం ఆక్రమించుకొని వుంటారు ; బాష్పాల మానంగా ప్రకాశిస్తుంటారు.

డోలేంద్ర

అటువంటి వ్యక్తిని 'భారతరత్న'తోనా సత్కరించ వలసింది ? ఆయనను భారతరత్నగా పరిగణించడమంటే ఇప్పటి వరకు 'భారతరత్న' లుగా మనం సత్కరించిన వారితో ఆయన్ను సమస్థాయిలో నిలబెట్టడం అవుతుంది. ఎఐఎడిఎంకె సానుభూతి సంపాదించడం కోసం ఎంజిఆర్‌కు భారతరత్న ఇచ్చిన రోజే ఆ బిరుదుకు విలువ పోయింది. సుదీర్ఘకాలం పాటు ఒక ప్రాంతీయ పార్టీ నాయకుడిగా ముఖ్య మంత్రిత్వం నెరపడం తప్ప, ఎంజిఆర్ భారతదేశానికి చేసిన సేవ, జాతి గౌరవం అందుకోగల త్యాగం ఏమి వున్నట్లు ? అవి నీతి, ఆశ్రిత పక్షపాతం, స్త్రీలోలత్వం, పరిపాలనలో అసమర్థత వంటి అవలక్షణాలన్నీ మూర్తీభవించిన సర్వ సాధారణ రాజకీయవేత్త ఆయన. తమిళనాడులో తప్ప దక్షిణాదిలో సైతం ఆయన ప్రభావం లేదు. ఆయన మరణానంతరం జరిగిన ఎన్నికలలో ఆ తమిళ ప్రజలే ఆయనకు బద్ధ శత్రువైన కరుణానిధిని అందలమెక్కించారు. అంటే సినిమా గ్లామర్ తప్ప ఒక రాజకీయ వాదిగా ఆయన తమిళ ప్రజలను సైతం ప్రభావితం చేయలేకపోయాడన్నమాట. మరొక యాభై ఏళ్ళ తర్వాత చరిత్ర పాఠం చదివే పిల్లవాడికి ఎంజిఆర్‌కు, నేతాజీకి మధ్య తేడా ఎట్లా తెలుస్తుంది. ''భారతజాతికి అపురూపమైన సేవలందించిన ఎంజిఆర్, నేతాజీ, జెఆర్‌డి టాటాలను భారతరత్న

కొరవ 9 పేజీలో

సారస్వత సేవే జీవిత పరమార్థంగా భావించిన

# పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రి

సంస్కృతాంధ్రాలలో నిగ్గు తేరిన పాండిత్యం కల్గిన శ్రీ పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రి గారు 11.4.1906 లో ప్రకాశం జిల్లా కరవదిలో జన్మించారు. 86 సంవత్సరాల నిండు జీవితంలో సారస్వత సేవయే జీవిత పరమార్థంగా, బహుగ్రంథ రచయితగా వాసికెక్కారు. శాస్త్రిగారు వ్యాకరణ పండితుల శిష్యరికం చేసి భాష్యాంత వ్యాకరణం అధ్యయనం చేశారు. ప్రస్థానత్రయాన్ని ఉపదేశం పొందారు. శ్రీ కంచి కామకోటి పీఠాధి పతులచే మంత్రోపదేశాన్ని పొందారు. విద్వత్సభలలో "అభినవ నన్నపార్య" "సరసకవి" బిరుదులు పొందారు.

వారికి ఒక కన్ను చూపు పూర్తిగా లేకపోవడం, శ్రవణేంద్రియం పూర్తిగా పనిచేయక పోవడం ఏర్పడినా బృహత్తర గ్రంథ రచనలో మునిగి తేలారంటే వారిలో చెప్పరాని ఒక అద్భుత శక్తి ఉన్నట్లు కనపడుతుంది. సోదర భక్తిలో భరతునిలాంటి వారు కాబట్టే అన్నగారు రచించి, అచ్చుకానట్టి పద్మపురాణాన్ని విశ్వేశ్వర శాస్త్రిగారు అన్నగారి మరణా నంతరం అచ్చు వేయించి పండితలోకంలో ప్రచారం చేశారు. ఈ



కవి పండితుడు నిత్యవ్యవహారంలో గ్రాంథిక భాషనే వాడేవారు. మిత్రులకు లేఖలు కూడా గ్రాంథిక భాషలో వ్రాసేవారు.

వారి రచనలో కావ్యానువాదాలు, విమర్శలు, వచన కావ్యాలుచోటు చేసుకొన్నాయి. వారి సాహిత్యాన్ని సమీక్షిద్దాం.

**రత్నపాంచాలిక నాటిక :**

సర్వజ్ఞసింగ భూపాలుని సంస్కృత కృతికి ఆంధ్రాను వాదమిది. ఇది నాలుగంకాల నాటకము. ఇది రత్నావళి ప్రియదర్శికా నాటికలను చమత్కృతిని చక్కగా పోషించారు.

**ఆంధ్ర దూత వాక్యము**

భాస మహాకవి సంస్కృత కృతికి అనువాదం శ్రీ కృష్ణుడు పాండవ ప్రార్థనచే కౌరవుల కడకు పోయి నడిపిన రాయబారమే ఇందలి కథ. దశరూపములలో ఇది వ్యాయోగము క్రిందికి వచ్చును. ఇది ఏకాంకము. శ్రీ కృష్ణుని బంధించుటకు, తుదకు సంహరించుటకు దుర్యోధనుడు సాగించిన యత్నాలన్నీ రాజ్య నిమిత్తమే గాని స్త్రీ నిమిత్తము కాదని స్పష్టం చేశారు.

**ఆంధ్రప్రద్యుమ్నాభ్యుదయ నాటకము**

శ్రీ రవి వర్మ భూపాలుని సంస్కృతకృతికి ఆంధ్రీకరణము.

కొరవ 9 పేజీలో

# నెల్లూరు నలుచెరగుల్లో
## విశ్లేషకుడు

### బ్యాంకు అభ్యర్థి ఇంకా సస్పెన్స్!

కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్ష పదవికి అభ్యర్థి ఎవరనేది ఇంకా సస్పెన్స్‌గానే వుంది. అధ్యక్ష పదవికి 6 తేది నామినేషన్లు వేయాలి. 11 తేది ఎన్నిక జరుగుతుంది. అంటే నామినేషన్లకు ఒక వారం కూడా వ్యవధి లేదు. సొసైటీ అధ్యక్షుల ఎన్నికలు పూర్తయిపోయాయి. కాంగ్రెస్‌లో ఏ వర్గానికి ఎన్ని అనేది తేల్చి చెప్పడం ఎవరి తరమూ కావడం లేదు. కాని, కాంగ్రెస్ తెలుగుదేశంల మధ్య చూస్తే మాత్రం తేడా అపరిమితం. 187 మంది అధ్యక్షులకు గాను దాదాపు 140 కాంగ్రెస్ పరమైనాయి. తక్కిన వాటిలో బిజెపి, సిపిఎం, తెలుగుదేశం వున్నాయి. జిల్లాలో తెలుగుదేశం ఇంత దారుణంగా ఓడిపోవడం విచిత్రమైన విషయం. నల్లపరెడ్డి సోదరులు కాలికి బలపం కట్టుకొని తిరిగినా, గ్రామీణ ఓటర్లు కాంగ్రెస్‌నే వరించారు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్ధన రెడ్డి ప్రతిష్టను అపరిమితంగా పెంచింది ఈ సంఖ్య.

ఎమ్మెల్యేలలో శ్రీ కలికి యానాది రెడ్డి అందరి కంటే ఎక్కువగా అధ్యక్షులను గెల్పించుకున్నట్లు కన్పిస్తున్నది. మంత్రి శ్రీమాదాల జానకిరాం కూడా అంచుమించు ఆయనతో సరిసమాన స్థాయిలో వున్నారు. వర్గాల పరంగా ఆనం వారు దాదాపు పాతిక మందిని పట్టుకోగలిగారు. గూడూరు డివిజన్ మొత్తం- రమారమి 55 - జనార్ధన రెడ్డి, వేమారెడ్డి రామచంద్రారెడ్డిల పరమైంది.

అభ్యర్థిత్వాల విషయానికొస్తే అప్పటికి వేమారెడ్డి రామచంద్రారెడ్డి పేరే ప్రబలంగా విన్పిస్తున్నది. ముత్తుకూరు దగ్గరున్న దువ్వూరు వారి పాళెం సొసైటీలో హఠాత్తుగా. దొడ్డిదారిన ఆయన సోదరుడు శ్రీ వేమారెడ్డి వెంకట కృష్ణా రెడ్డి అధ్యక్షుడుగా ఎంపికకావడం విస్మయం కల్గించే పరిణామం. తనకు సిఎం బ్యాంకు పదవి ఇస్తానన్నాడని చెప్పి, గెల్చిన ఒక డైరక్టర్ చేత రాజీనామా పెట్టించి, కో ఆప్షన్ ద్వారా అధ్యక్షుడైనాడట వెంకట కృష్ణయ్య. ఆ తలంపు వుండేవాడు మొదటనే ఎందుకు ఎన్నికలలో నిలబడలేదో, దొడ్డి గుమ్మం ద్వారా దొంగలాగా ఎందుకు దూరవలసి వచ్చిందో తెలియదు. సిఎం ప్రామిస్ పొందిన వాడుగా ప్రచారం అవుతున్న మరొక ముఖ్య అభ్యర్థి శ్రీ దేవ కుమారరెడ్డి కోవూరు తాలూకాలో అస్తులు, నెల్లూరు టౌన్‌లో కాపురం, నరసింహకొండలో సొసైటీ అధ్యక్షత —ఈ మూడింటికి పొంతన ఏమిటో అర్థమే కాదు. వెంకట రత్నం నాయుడు గారూ సిఎం పైనే ఆశ పెట్టుకొని వున్నారు.

మేగొరె మేధస్సు నుండి పుట్టుకొని, నల్లపరెడ్డి శ్రీనివాసుల రెడ్డి నోటి ద్వారా బారసాల జరిపించు కున్న మేనకూరు శ్రీనివాసుల రెడ్డి పేరు అప్పుడంతగా విన్పడడం లేదు. మే.శ్రీ.రె.ను రంగంలోకి దింపితే మాగుంట సోదరుల ద్వారా పత్తిడి తెచ్చి వేమారెడ్డి రామచంద్రా రెడ్డిని ఎలిమినేట్ చేయవచ్చునన్నది. నల్లపరెడ్డి వర్యుని కుతంత్రమంటున్నారు. కాని స్థానిక రాజకీయాలలో మాగుంట సుబ్బరామిరెడ్డి జోక్యం చేసుకుంటాడని భావించలేము.

వీరందరిలో వరమాల ఎవరి మొదలో పడుతుందన్నది ముఖ్యమంత్రికి తప్ప మరొకరికి తెలియదు. ఆయన నోటి నుండి రాలే ముత్యాల కోసం 6 తేది వరకు ఎదురు చూడవలసిందే!

తెలుగుదేశానికి సంబంధించి చంద్రమోహన్ రెడ్డికి ఇంకా దింపుడు కళ్లం ఆశ కొటకలాడుతూనే వుంది. అది అడియాశ అనేది వాస్తవం. తనకు అవకాశం కన్పించని పరిస్థితులలో ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా కాంగ్రెస్‌లో నుంచి ఓట్లు చీల్చుకొని రాగల నాయకుడెవరికైనా మద్దతు ఇచ్చి చికాకు కల్పించే ఆలోచనలేమైనా వున్నాయా ? ఏ పుట్టలో ఏ పాముందో ఎవరి కెరుక ?

### చిరంజీవి రాక — నెల్లూరు దద్దరిల్లింది

సినీ నటుడు శ్రీ చిరంజీవి 26 తేది సాయంత్రం నెల్లూరు వచ్చారు. రౌడీ అల్లుడు శతదినోత్సవం — ఆయన పర్యటన ఉద్దేశ్యం. అర్చన హాల్‌లో జరిగింది సభ. చిరంజీవి రాక నెల్లూరును దద్దరిల్లజేసింది. అది జనమా ? 1982 లో తొలి సారిగా పర్యటనకు వచ్చిన ఎన్‌టి రామారావు సభలను తలపింప జేసింది. ఆయనేమో హాల్‌లోకి దూరిపోయాడు. లోపల గట్టిగా రెండువేల మందికి కూడా ప్రవేశం దొరకలేదు. జనం మాత్రం అంతకు పాతిక రెట్లు ఎక్కువ. గాంధీ బొమ్మ దగ్గర నుంచి థియేటర్ వరకు ఇసకేస్తే రాలలేదు. సినిమా నటుల పట్ల ప్రజలలో వున్న క్రేజ్, వెర్రి చూస్తే ఆశ్చర్యం కల్గుతున్నది.

సభ ఎంత బ్రహ్మాండంగా జరిగిందో ప్రత్యేకంగా చెప్పాలా ? శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి అధ్యక్షంచారు. తమ సంస్థ నిర్మించిన ఖైదీ చిత్రం ద్వారా చిరంజీవి తెలుగులోకి రావడం తనకు ఎంతో సంతోషం కల్గించే విషయం అన్నారాయన. చిరంజీవి చిత్రాల శతదినోత్సవాలన్నీ ఇక నుంచి తన చేతుల మీదుగా, నెల్లూరులోనే జరిపిస్తానని చెప్పారు. దివ్యభారతి, సత్యనారాయణ, కె. విశ్వనాథ్, కె. రాఘవేంద్రరావు, అల్లు రామలింగయ్య, బప్పిలహరి, దాసరి నారాయణ రావు వంటి ప్రముఖులంతా సభకు విచ్చేశారు. ఎగ్జిబిటర్‌గా శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, థియేటర్ పక్షాన కళ్యాణి ఫిలింస్ ప్రసన్న కుమార్‌రెడ్డి సభా నిర్వహణాభారం మోశారు.

### రైల్లో చోరీ

పెట్లూరు విమ్మ పరిశోధనా కేంద్రంలో పనిజేస్తున్న డాక్టర్ ఎస్. ఈశ్వర రెడ్డి సకుటుంబంగా హైదరాబాదు నుండి 24 తేది వెంకటగిరికి నారాయణాద్రి ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణిస్తుండగా నెల్లూరు — గూడూరు మధ్య సూట్‌కేసు చోరగ్రస్తమైంది. పది సవర్ల బంగారు నగలు, వి.సి.ఆర్. కాబోలు ఒకటి అందులో వుండినాయట. గూడూరు రైల్వే పోలీస్‌కు రిపోర్టు చేశాడట శ్రీ ఈశ్వర రెడ్డి; దొరుకుతాయో లేక గతంగతః అనుకోవలసి వస్తుందోమరి.

నారాయణ! నారాయణ !!

### చెట్లు ఎట్లా పెంచాలి ?

చెట్లను పెంచండి పెంచండి అని ప్రభుత్వం పూదరగొడుతుంది. ఇందుకోసం సోషల్ ఫారెస్టు అని, ఉద్యానవన శాఖ అని వున్నాయి. కోట్లాది రూపాయల కేటాయింపులు. గజెటెడ్ వుద్యోగుల నిర్వహణలు. హంగులన్నీ బాగున్నాయి. కాని వాటి వల్ల చెట్ల పెంపకంలో వుత్సాహమున్న వారికి వుపయోగమేమైనా వుందా ? ఈ శాఖలలో ఏమేమి చెట్ల మొక్కలు లభిస్తాయి ? వాటిని వుచితంగాగాని, ఖరీదుకు గాని పొందడానికిఅర్హులెవరు ? మొక్కలు కూడా బలహీన వర్గాలకే అంకితమా ? లేక, అన్ని వర్గాల వారూ అర్హులా? అవి ఎక్కడ లభిస్తాయి ? ఎవర్నడగాలి ? ఏమో తెలియడం లేదు; మొక్కల కోసం ప్రయత్నించి నిరుత్సాహానికి గురికావలసి వస్తున్నది.

కొబ్బరి మొక్కలు మొదలు అన్ని రకాల, ఫలవృక్షాలు, మునగ వంటి కూరగాయయలు చెట్లు, నీడనిచ్చే చెట్లు, మొక్కలలో తక్కువ కాలంలో ఫలితాన్నిచ్చేవి, హైబ్రిడ్ రకాలు ఎన్నో వచ్చివున్నాయి. అవి సోషల్ ఫారెస్టు నర్సరీలలోగాని, వుద్యానవన శాఖ నర్సరీలలో గాని లభ్యమైతే ఎందరో నాటుకుంటారు; పల్లెలకు, పట్టు వాసాలకు పచ్చదనాన్ని చేకూరుస్తారు. ఉచితంగా ఇవ్వవలసిన అవసరం లేదు, ఖరీదు తీసుకొని నమ్మకమైన మొక్కలను నెల్లూరు వంటి ముఖ్యమైన కేంద్రాలలో సరఫరా చేయగలిగితే చాలు. కాని ఆ గతి కూడా లేదే !

పూర్వం వ్యవసాయ శాఖ, వారే కూరగాయల విత్తనాలు వుచితంగా సరఫరా చేసేవారు; టెంకాయ మొక్కల వంటివి అడిగితే తెప్పించి ఇచ్చేవారు; అఖరుకు తోట్లలో రోజా మొక్కలను పెంచి అమ్మేవారు. దానికి ప్రత్యేకంగా ఒక శాఖ ఒక డిప్యూటి డైరక్టరాది సకల సిబ్బంది వున్న నేడు ఆ కార్యకలాపాలే కరువయ్యాయి. సోషల్ ఫారెస్టు శాఖ వారి పంపక పద్ధతి కూడా ఏమిటో తెలియదు.

ఉద్యాన వన శాఖ పేరుతో, పదిమందికి వుద్యోగాలు కల్పించడానికో లక్షలు, కోట్లు ఖర్చు పెట్టడానికో కాదు వుండేది. ! ప్రజలు కోరే వివిధ రకాల మొక్కలను, ఉద్యానవన శాఖ సమకూర్చలేక పోతున్నదనే కొరతను ప్రభుత్వం గమనించాలి ! ఈ లోటును తీర్చాలి.

### గ్రిగ్ పోటీలు

రాజకీయాల సంగతి ప్రక్కన బెడితే శ్రీ ఆనం వివేకానందరెడ్డి మంచి

కొరవ 6 పేజిలో

గూడూరు డి.ము. వారి కోర్టులో

SC 9/91

కలికి చంద్రా రెడ్డి — వాది

Vs

మల్లి గురవయ్య — ప్రతివాది

To
శ్రీ మల్లి గురవయ్య
S/o. పోలయ్య అనువారికి

**నోటీసు**

సదరు నెంబరు దావా వాది మీ మీద నుండి దావా పరిహారములను రాబట్టుకొను నిమిత్తం మీ మీద దావా వేసి ఉన్నందున మీరు తే 19.2.92 ది పగలు 10 గంటలకు సై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెలుపుకొనవచ్చును. లేనియెడల సదరు విషయమై మీ పరోక్షములో విచారించి తీర్మానించబడును.

**C Subba Reddy**
Advocate for the Petitioner

## నోటీసు ప్రకటన

యిందు మూలముగా యావన్మందికి తెలియ జేయడము ఏమనగా నెల్లూరు చిన్నబజారు కాపురస్తురాలు యగు లేటు చక్కా సుబ్బరామయ్య గారి భార్య లక్ష్మి తాయారమ్మ గారు మాకు యిచ్చిన సంజాయిషీ ప్రకారం యీ క్రింది విధముగా తెలియజేయడమైనది.

మా క్లయింటు భర్తయగు లేటు చక్కా సుబ్బరామయ్య గారు తన స్వార్జితపు ఆస్తి అయిన నెల్లూరు చిన్నబజారు లోని నెం. 19/493 రు గల మిద్దె, యితర వరాస్తులను తే. 2.11.1967 దిన వ్రాయించి యిచ్చిన వీలునామా ద్వారా సర్వసంపూర్ణ హక్కులతో నా క్లయింటు అనుభవిస్తున్నది. మా క్లయింటు కుమారులయిన చక్కా పుల్లయ్యకు గాని, ఆయన కుమారుడుయిన చక్కా శ్రీనివాసులుకు గాని సదరు ఆస్తిలో ఎటువంటి హక్కులు లేవన్ని, వారలు మా క్లయింటును నష్ట పర్చుటకు ఎట్టి వ్రాతలు వ్రాసినను అట్టివి మా క్లయింటును బద్ధ పర్చ వనిన్ని యిందు మూలముగా తెలయజేయడమైనది.

బి. భాస్కర ప్రసాద్ రావు
అడ్వకేటు, నెల్లూరు

## గ్రామాధికార్లు

(మొదటి పేజీ కరవ)

నిధుల దుర్వినియోగం వంటి కేసులు, రికార్డులు తారుమారు చేసిన సంఘటనలు వంటివి కూడా కంప్యూటరుకు ఎక్కించారు. పాపం గ్రామాధికారులకు ఈ కంప్యూటర్ పెద్ద న్యూసెన్స్‌గా పరిణమించింది. ఏది దాచిపెట్టడానికి వీలుకాలేదు. ఈ సంగతి తెలియక దొంగ సర్టిఫికెట్లు పెట్టిన వారిలో అత్యధికులు సులభంగా దొరికిపోయారు. గత ఇంటర్వ్యూలలో 5 తరగతి పాస్ సర్టిఫికేట్ ఇచ్చి, ఇప్పుడు 7 తరగతని, ఇప్పుడు పదవతరగతిగా మార్చిన వారి సంఖ్య దాదాపు 70 వరకూ వుందంటున్నారు. డేట్ ఆఫ్ బర్త్ సర్టిఫికెట్ల విషయంలోనూ ఇదే జరిగింది. నెల్లూరు మండలంలోని 70 ఏళ్ళ పెద్ద రైతు ఒకరు తనకు 52 ఏళ్ళ మాత్రమేనని సర్టిఫికేట్ ఇచ్చాడట. ఫోర్జరీ సర్టిఫికెట్ల సంఖ్య అపరిమితం. ఎలిమెంటరీ హైస్కూలు పేరుతో సమర్పించిన సర్టిఫికెట్లలో తొలి దర్యాప్తులోనే పన్నెండు సర్టిఫికెట్లు నకిలీవని తేలిపోయింది. ఆఖరకు హెడ్మాష్టరు సంతకాన్ని సైతం ఫోర్జరీ చేసేశారు. పల్లెటూళ్ళ స్కూళ్ళ పేరుతో పెట్టిన సర్టిఫికెట్లలో సగభాగం దొంగవే !

సర్టిఫికెట్లు, అర్హతలు సక్రమంగా వున్నవారందరి ఎంపిక 30 తేది పూర్తియిపోయింది. కలెక్టర్, జాయింట్ కలెక్టర్, డిడిఓ, ఆర్‌డిఓలు రెండు రాత్రిళ్ళు రెండు పగళ్ళుఅక్కడ మకాం వేసి స్పష్టంగా వున్న అభ్యర్థుల ఎంపిక పూర్తి చేసేశారు. వారందరికి అపాయింట్‌మెంట్ ఆర్డర్లు సైతం విడుదలై పోయాయి. 5 తేదీలోగా సంబంధిత ఆర్‌డిఓలు, ఎమ్మార్వోల ద్వారా అభ్యర్థులకు వాటిని అంద జేస్తారు. దాదాపు వంద గ్రామాల విషయంలో మాత్రం ఇంకా నిర్ణయం జరగలేదు.

అపాయింట్‌మెంట్ ఇచ్చిన వారిపై సైతం 15 తేదిలోగా విచారణ జరుపుతారట. వారు సమర్పించిన సర్టిఫికెట్లు గత చరిత్రల పై దర్యాప్తుకు సిబ్బందిని నియమించారు. ఎక్కడైనా లోపం కన్పిస్తే ఇచ్చిన అపాయింట్ మెంట్‌నూ క్యాన్సిల్ చేయమని ప్రభుత్వం ఆదేశించింది. అందువల్ల ఆ తేదీ వరకు గ్రామాధికారులు ఉగిసలాటలా వుండవలసిందే !

ఉద్యోగాలు రాక దాదాపు వంద మంది నిరాశపడ వలసి వస్తూంటే, అభ్యర్థులు లేక 70 గ్రామాల వరకు ఖాళీగా వుండిపోతున్నాయి. వాటికి వుళ్ళో ఇంటర్వ్యూలు జరపవలసి వస్తుంది. ప్రస్తుత నియామకాలలో మాత్రం స్థానిక అభ్యర్థులకు ప్రాధాన్యత నివ్వారు. ఖాళీగా వుండే గ్రామాలకు ఆ నియమం చెల్లదు. వాటికి ఎప్పుడు నియామకాలు జరుపుతారో తెలియదు.

## జనవాణి

(3 పేజీ కరవ)

అయినందువల్లనే లోపలకు తొంగి చూడాలంటేనే భయం వేస్తున్నది. ధైర్యం చేసి పాదం లోపలమోపితే ఈగలు ఝుమ్మని ముసురుకుంటాయి. ప్రయాణీకులెవరూ అంతటి సాహసం చేయడం లేదు.

వందలాది ప్రయాణీకులు ఎండకు, వానకు షెల్టర్ తీసుకోవలసిన భవనాన్ని పాడు పెట్టడం, పశువుల కొట్టం కంటే హీనంగా నిర్వహించడం అన్యాయం. మునిసిపాలిటికి సరే, ఏదీ పట్టదు: కనీసం ఆర్‌టిసి అధికారులైనా దీన్ని చక్కదిద్దకూడదా ?

— కొప్పర్తి జనార్ధన్
బుచ్చిరెడ్డిపాళెం

## పి.సి.సి.

( మొదటి పేజీ కరవ )

సైతం నిర్వహించే ఆలోచన ముఖ్యమంత్రికి కల్గిందని వినికిడి. రాష్ట్రంలో జిల్లా ప్రజా పరిషత్, మండలాలకు రేపు మార్చితో పదవీకాలం పూర్తి కానున్నది. గ్రామ పంచాయితీలకు మాత్రం ఇంకా ఏడాది ఆయువు వుంది. అయితే జూన్ నెలల ప్రాంతంలో రెండింటికీ కలిపి ఒకేసారి నిర్వహించాలని ప్రభుత్వం తలపెడు తున్నట్లు వార్త. ఆ ఎన్నికల ప్రకటన జరిగితే ఎమ్మెల్యేలు మరొక మూడు నాలుగు నెలలు హైదరాబాదు మర్చిపోయి తమ తమ వూళ్లలో మకాం పెట్టవలసి వుంటుంది. అవి పూర్తయ్యే వరకు ముఖ్యమంత్రి జోలికి వచ్చేవారు వుండరు.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ కరవ

క్రీడాభిమాని. ఎక్కడ ఆటలు ... అక్కడలా

ప్రత్యక్షమౌతాడు. జేబుకు చిల్లి పెట్టుకొని రాత్రింబవళ్లు పని చేస్తాడు. ఈ ఏడాది గ్రిగ్ మెమోరియల్ టోర్నమెంట్స్ కూడా అంతే ! తూతూ మంత్రంగా, జరుగుతున్నట్లు కూడా తెలియకుండా జరిగిపోయే ఈ జిల్లా క్రీడోత్సవాలను వివేకానంద రెడ్డి భారీ ఎత్తున జరిపించి, ప్రతి అథ్లెట్‌కు బహుమతి ఇచ్చి, హడావుడి చేశాడు. వివరాలు పై వారం.

## మహతి వార్షికోత్సవం

శ్రీ మహతి సంగీత విద్యాలయం చతుర్థ వార్షికోత్సవం 24 తేది వేద సంస్కృత కళాశాల ఆవరణంలో జరిగింది. ఇదే సందర్భంలో త్యాగరాజ స్వామి ఆరాధనోత్సవాలు కూడా జరిపించారు.

శ్రీమతి పాలేటి ఉమాదేవి గాత్ర కచ్చేరి, వేదం కళావతి వీణా కచేరి, నాట్యాచార్య శ్రీ ఎస్. వి. రమణయ్య శిష్యబృందంచే భరతనాట్య ప్రదర్శనలు జరిగాయి. శ్రీకె. ఈశ్వరరావు కార్యక్రమాలు నిర్వహించారు.

## వేణుగోపాల స్వామి కాలేజి కరస్పాండెంటు

వేణుగోపాల స్వామి కాలేజి కొత్త కరస్పాండెంటుగా శ్రీ ఆనం వివేకానంద రెడ్డి నియమితులైనారు. వి.ఆర్ కాలేజి పలి పాడు పెట్టకుండా ఈ కాలేజినైనా వృద్ధిలోకి తేగల్గితే పదవికి సార్థకత; సోదరుడి అడుగుజాడలలో నడిస్తే ఇంతే సంగతులు!

## ఇళ్ల పన్నులు కట్టి తీరాల్సిందే!

జోనను జోన్‌లుగా విడగొట్టి వర్గాల వారీగా రేట్లు నిర్ణయించి ఆ ప్రకారం ప్రాంతాలలోని ఇళ్ళకు పన్ను కట్టాలని ప్రభుత్వం చేసిన ఉత్తర్వు అమలు చేసి తీరవలసిందేనట. కమీషనర్ చేసిన నోటిఫికేషన్‌ను కౌన్సిల్ తిరస్కరించినా, అధికారుల మన ముక్కుపిండి పన్నులు దండుక పోవడానికి సిద్ధ పడుతున్నారు.

## నీటి మట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 20.0 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 7.0 అ |
| నెల్లూరు చెరువు | 14.7 అ |

## నెల్లూరు బజారు

మొలగొలుకు

| | | |
|---|---|---|
| 9672 | పాతవి | 3200/- |
| ” | క్రొత్తవి | 2600/- |
| 9764 | పాతవి | 3400/- |
| సున్నాలు | పాతవి | 3100/- |
| మొలగొలకు బియ్యం 70 కి | | 440/- |
| బంగారు సవర 8 గ్రా | | 3600/- |
| వెండి | 10 గ్రా | 85/- |

*

# ఎన్టీఆర్ కాల్షీట్‌కు కోటి చెల్లించిన నిర్మాత

''నా దేశం '' చిత్రం తర్వాత 1983 లో ముఖ్యమంత్రి పదవి నలంకరించాక ఎన్టీఆర్ స్వయంగా ''బ్రహ్మర్షి విశ్వామిత్ర'' చిత్రం రూపొందించడం తప్ప ఇతర సంస్థల చిత్రాలలో నటించలేదు. పాతే ఇప్పుడు ''సామ్రాట్ అశోక'' నిర్మాణంలో ఉంది. కొంత కాలంగా ముగ్గురు నలుగురు నిర్మాతలాయన్ని తమ చిత్రంలో నటించమని ఎంతగానో కోరుతూ వచ్చారు. నటించననిగాని, నటిస్తానని గాని చెప్పక మందహాసంతో దాటవేస్తూ వచ్చిన ఎన్టీఆర్ ' ఇటీవల హఠాత్తుగా కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఒక నిర్మాత చిత్రంలో నటించడానికి పచ్చ జెండా చూపారు. ''ఆ సబ్జెక్టు నాకు బాగా నచ్చింది. సమాజాన్ని ప్రభావితం చేసే మహోన్నతమైన పాత్ర అది. కేవలం డబ్బు కోసం అంగీకరించడంలేదు.నా అర్ధాంగి శ్రీమతి బసవతారకం పేరు మీద నిర్మించే అనుపత్రికి నిధి సేకరించడమే నా ధ్యేయం'' అన్నారాయన. ఆయనకా నిర్మాత కోటి రూపాయల పారితోషికం ఇస్తున్నట్లు వదంతి.

## ఇతర భాషల దర్శకులు

మన నిర్మాతలకు మన దర్శకుల మీద నమ్మకం సన్నగిల్లినట్లుంది.

**మద్రాసు సినిమా వార్తలు**

అందుకే మలయాళ, తమిళ, కన్నడ దర్శకులను బుక్ చేసుకొంటున్నారు. వీళ్ళకు మన సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు బొత్తిగా తెలియవు. ఏ డైలాగను ఎలా చెప్పాలో అంత కన్నా తెలియదు. వీళ్ళు దర్శకత్వం వహించిన చిత్రాలు ఎన్ని విజయవంతమయ్యాయి ? మన చిత్ర కథలు ఇతర భాషలవి. దర్శకులు, తారలు, సాంకేతిక నిపుణులు చాలా వరకు ఇతర భాషల వారే. ఇలాంటి వారితో తయారయ్యే చిత్రాలు ఎలా ప్రజాదరణను పొందుతాయి ? ఈ విషయమే ఒక నిర్మాతను అడిగితే ''మన దర్శకుల కొందరి చేతుల్లో ఎప్పుడూ మూడు నాలుగు పిక్చర్లు వుంటాయి. వీళ్ళ దృష్టి ఏ ఒక్క చిత్రం మీద కూడా లగ్నమై వుండదు. ఒక వైపు కథా చర్చ. మరో వంక మ్యూజిక్ సిట్టింగ్. అదే రోజు ఇంకో చిత్రం షూటింగ్. మరో చిత్రం డబ్బింగు బాగులేనందువల్ల కొన్ని పాత్రల తెలుగు మాటలు సరిగ్గా వినిపించలేదు. పాటలు గూడా డిటో. గ్రూపు డాన్సులు రక్తి కట్టలేదు. ఇళయ రాజా సంగీతం గొప్పగా వుంది.

కొరవ 9 పేజీలో

# బంగారం లాంటి పాత్ర చేజార్చుకున్న యమున

''నాగమ్మ'' చిత్రంతో నటి యమున బిజీ అయిపోయింది. పాములతో తయారయ్యే చిత్రాలు మూడింటిలో ఇట్టే బుక్ అయిపోయింది. జంధ్యాల దర్శకత్వం వహించే ''బాబాయ్ హోటల్'' చిత్రంలో బ్రహ్మానందం సరసన బుక్ అయింది. ఒక రోజు షూటింగ్‌లో పాల్గొంది కూడా. కాని, ఆ మర్నాడే ఆ పాత్ర తన ఇమేజ్‌ని దెబ్బ తీస్తుందని నిరాకరించింది. ''వాళ్ళు ఆ పాత్ర ఔన్నత్యం గురించి మాకు మొదట ఎంతో గొప్పగా చెప్పారు. తీరా షూటింగ్‌కు వెళ్ళాక ఆ పాత్ర మరో విధంగా మలచబడిందని తెలిసింది. మరి నా ఇమేజ్ దెబ్బతింటుందిగా ?'' అని యమున సంజాయిషీ. పాముల ధర్మమా అని వరుసగా మూడు ''పాముల'' చిత్రాలలో బుక్ కాకుండా ఉంటే, యమున బాబాయ్ హోటల్ లోని పాత్రను నిరాకరించేది కాదు. నిర్మాత క్రియేటివ్ కమర్షియల్ అధినేత కె.యస్.

**బ్రహ్మానందం ప్రక్కన నటిస్తే కిరీటాలు రాల్తాయా ?**

రామారావు. దర్శకుడు జంధ్యాల కూడా పేరు మోసినవాడే. ''బాబాయ్ హోటల్'' యజమాని సహృదయత గురించి విజయవాడ ప్రాంతాల్లో తెలియని వారెవరూ ఉండరు. వేడి వేడి ఇడ్లీలకు వెన్నతో కారప్పొడి వేసి ఎంతో ఆప్యాయతతో గిరాకీలను ఆకట్టుకునే బాబాయ్ గురించి ఇప్పటికీ చెప్పుకుంటారు. ఆ పాత్ర ధరిస్తున్నది బ్రహ్మానందం. ఒక హాస్య నటుడి ప్రక్కన నటిస్తే ఇక తన ప్రక్కన హీరోలు నటించడానికి ఇష్టపడరేమోనని యమునకు ఎవరైనా సలహా ఇచ్చివుంటారు. కాని, ఈ రోజు బ్రహ్మానందం హీరోల కన్నా బిజీగా ఉన్నారు. అది తెలిసి కూడా యమున ఎందుకు పప్పులో కాలు వేసిందో మరి. ఎట్టయితేనేఆమె ఒక చక్కని అవకాశాన్ని కోల్పోయింది. చేతులు కాలాక ఇక ఆకులు పట్టుకొని ప్రయోజనమేమిటి ? ఈమె అసలు కర్నాటక వనిత. అక్కడ ఈమె పేరు సౌమ్యశ్రీ.



రేపటికొడుకు చిత్రంలో వేలు, భాగ్యశ్రీ

# పివి కుమారుడి గంధర్వ గానం

మన ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు పుత్రుడు, ప్రముఖ పారిశ్రామికవేత్త పి. రాజేశ్వరరావు మధుర గాయకుడు. ఈయన ''దూరదర్శన్'' కోసం ఇళయరాజా సంగీత దర్శకత్వంలో పాడిన కొన్ని పాటలు జనవరి 22 నే మద్రాసు ప్రసాద్ రికార్డింగ్ స్టూడియోలో రికార్డు చేయబడ్డాయి. ఈయనతో గాయని చిత్ర గొంతు కలిపిన ఒక జంట పాట వీడియోగా కూడా తీయబడింది. ఈ పాటలు త్వరలో జాతీయ కార్యక్రమంలో ప్రసారం చేయబడతాయి. పి. రాజేశ్వరరావు తన కేదైనా తమిళ చిత్రం చూడాలని ఉందని చెప్పిన వెంటనే తమిళ నిర్మాత 'జి.వి.' తన 'గుడ్‌లక్' థియేటర్‌లో విజయకాంత్ నటించిన ''చిన్న గౌండర'' అనే తమిళ చిత్ర ప్రదర్శనకు ఏర్పాటు చేశారు.

## విడుదలకు నోచుకోని చిత్రాలు

ఎప్పుడో సెన్సారై, విడుదలకు నోచుకోని 256 చిత్రాలు 'లాబ్' లలోని కోల్డ్ స్టోరేజిలలో మూలుగుతున్నాయి. అసలు 1991 లోని 27 చిత్రాలు ఫస్ట్ కాపీ సిద్ధమై కూడా విడుదలకు నోచుకోలేదు. ఎంత పెట్టుబడి కట్టుబడిపోయింది ? హిందీ చిత్ర పరిశ్రమ మరీ అధ్వాన్నంగా ఉంది. 161 చిత్రాలు నిరయ విడుదలైతే, కొనుగోలుదారుల కొంపలు ముంచిన చిత్రాలు 123 దాకా ఉన్నాయి. ధర్మేంద్ర (8) , మిథున్ చక్రవర్తి (7), రాజ్ బబ్బర్ (6), వినోద్ ఖన్నా (5), చంకీ పాండే (5), శత్రుఘ్నసిన్హా (4) నటించిన చిత్రమేది విజయవంతం కాలేదు !

## సురేష్‌తో భార్గవ్ ఆర్ట్స్ తాజా చిత్రం

''హీరో పుత్రి గైడ్. అతనికి రైల్వే స్టేషన్‌లో ఒక పిచ్చిది తారస పడుతుంది. ఆమెను వదిలించుకోవడానికి అతను నానా యాతనలు పడతాడు. చివరికి ఆమె పిచ్చిని ఎలా కుదురుస్తాడనేది ఎంతో కుతూహలం కల్గించే రీతిలో ప్రేక్షకులను ఆకట్టుకుంటుంది. తిరుపతిలో ఫిబ్రవరి 1 నుంచి 20 వరకు ఒక షెడ్యూల్. మార్చి 1 నుంచి 10 వరకు జరిగే మలి షెడ్యూల్‌తో షూటింగంతా పూర్తవు తుంది'' అన్నారు ఎస్. గోపాలరెడ్డి. ఈయన నిర్మిస్తున్న భార్గవ్ ఆర్ట్స్ 13వ చిత్రానికి ''కిళక్కుం'' అనే మలయాళ చిత్రం మాతృక. సురేష్ సరసన మీనా నాయిక. మాటలు : గణేష్‌పాత్రో. పాటలు : డాక్టర్ సి. నారాయణ రెడ్డి, వెన్నెలకంటి. ప్రొడక్షన్ : రంగారెడ్డి. దర్శకత్వం : కోడి రామకృష్ణ. జూన్ 10న బాలకృష్ణ పుట్టిన రోజున ఆయన ద్విపాత్రాభినయంతో మరో హిట్ చిత్రం నిర్మాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

తన క్రీడాభిమానాన్ని 'ఆటల అంటువ్యాధి'గా మార్చి, డాక్టర్లందరికీ అంటించేశారు డాక్టర్ ఎం. శ్రీధర రావు; తిరుపతి ఐఎంఏ రాష్ట్ర పరస్పులో మందుల సీసాలు, సిరంజీలలో మునిగితేలే వైద్యుల చేత బాలు, బ్యాట్ పట్టించి గంతులేయించారు. క్రికెట్ ప్లేయర్‌గా మారిన డాక్టర్ ఎం. మధుసూదన శాస్త్రి, కొత్త రకం ఆటను తోటి వైద్యులకు వివరిస్తున్న డాక్టర్ శ్రీధరరావు.

## సణుగుడు

(4 పేజీ కొరవ)

బిరుదుతో గౌరవించిరి' 'అనే పాఠం చదివే పిల్లవాడికి ఈ తేడా ఎట్లా బోధపడుతుంది ? నేతాజీ స్మృతికి అంతకంటే అవమానం, అపచారం ఇంకొకటుంటుందా ?

ఈ బిరుదు నిచ్చి నేతాజీని అవమానించి నట్లే, జెఆర్‌డి టాటాకు, దాన్ని ఇచ్చి ఆ బిరుదునే కించపరిచింది కేంద్రం ఈ సంవత్సరం. 'భారతరత్న' గౌరవం అందుకోగల ఘనతర చరిత్ర టాటాలకు, బిర్లాలకు వుందా ? భారతదేశ పారిశ్రామికాభ్యున్నతికి ఆయన చేసిన విశిష్ట సేవకు గుర్తింపుగా ఇచ్చినారట దీన్ని ! ఇంత కంటె ఆత్మవంచన మరొకటి వుండదు. భారతదేశ పారిశ్రామిక రంగం, అమెరికాతోనో జపాన్‌తోనో పోల్చి చూస్తే ఒంటెద్దు బండ్ల కాలంలోనే వుండడానికి కారకులు వీరేననడం నిందవేయడం కాబోదు. నెహ్రూ ప్రతిపాదించి, అమలు చేసిన సోషలిస్టు సిద్ధాంతాన్ని తమ ధన బలంతో, తెలివితో నిర్వీర్యం చేసి, గుత్త పెట్టుబడిదారీ వ్యవస్థను పెంచి పోషించిన మేధా సంపత్తి సైతం వీరిదే. ఉప్పు నుంచి ఉక్కు వరకు ఎక్కడ లాభం కన్పడినా అక్కడల్లా తమ పరిశ్రమల సామ్రాజ్యాన్ని విస్తరించుకుంటూ పోవడం తప్ప టాటాకాని, బిర్లాకాని పారిశ్రామిక రంగంలో దేశం సాంకేతికంగా అభివృద్ధి చెందడానికి చేసిన కృషి శూన్యం. రాజీవ్ గాంధీ వచ్చి టెక్నాలజీ బాంబులు పేల్చిన తర్వాత అందరూ పరుగులు పెట్టారు తప్ప, అప్పటి వరకు తమ లాబీయింగ్‌తో ఢిల్లీలో విధానాలను తమ కనుకూలంగా మల్చుకొని, తమ లాభాల సంపాదించుకోవడమే ప్రభుత్వ దృష్టిలో దేశానికి చేసిన సేవగా కన్పిస్తే, టాటా కంటే ముందుగా ధీరు భాయ్ అంబానీకి భారతరత్న బిరుదునివ్వాలి. టాటాలు వందేళ్ళలో సాధించిన అభివృద్ధిని ఆయన పాతికేళ్లలో పూర్తి చేశారు. పైపెచ్చు భారతీయ కార్పొరేట్ వ్యాపార ప్రపంచాన్ని మధ్య తరగతి కుటుంబీకుడి, గ్రామీణులకు సన్నిహితం చేసిన ఘనత కూడా అంబానీదే ! టాటా కంపెనీల షేర్ హోల్డర్ల సమావేశాలు ఫైవ్‌స్టార్ హోటల్ కాన్ఫరెన్స్ గదులలో జరిగితే, అంబానీ కంపెనీల సమావేశాలు మునిసిపల్ స్టేడియంలో జరుగుతాయి. ఒక కంపెనీ

టర్నోవర్ రెండువేల కోట్లు దాటించడానికి టాటాలకు శతాబ్దపు కాలం పడితే, ఇరవయ్యేళ్లలో ఆ ఘనత సాధించాడు అంబానీ !

టాటాకు పద్మభూషణ్ వంటి బిరుదులిచ్చివుంటే ఆ బిరుదుకు, ఆయనకు కూడా గౌరవంగా వుండేది. ఏది ఏమైనా నేతాజీకి జరిగిన అవమానం అందరి హృదయాలను కలచివేస్తున్నది !

*

జాతీయ ఉపాధ్యాయ అవార్డు పొందిన సిఎఎం హైస్కూలు రిటైర్డ్ హెడ్మాస్టర్ వై.బి. మిత్రను రిపబ్లిక్ డే సందర్భంగా సన్మానిస్తున్న కలెక్టర్ కె.రాజా

కోసం సాంకేతికంగా పరిశ్రమలు ఎదగనివ్వకుండా చేసిన ఘనులు టాటాలు, బిర్లాలే ! స్వాతంత్ర్యం వచ్చే నాటికి పందల కోట్లలో వుండిన వారి వ్యాపారం, ఈనాడు పదివేల కోట్లకు చేరిన మాట మాత్రం నిజం. ఎంఆర్‌టిపి చట్టాలు, సవాలక్ష నిబంధనలు వారి పారిశ్రామిక విస్తరణకు అవరోధం కాలేకపోయాయి. అయితే టాటాకు వున్న పందకు మించిన పరిశ్రమలలో భారత దేశం సాంకేతికతను సగర్వంగా చాటె పరిశ్రమ ఒక్కటీ లేదు. కేవలం వేల కోట్ల ఆస్తులు



**సవరణ**

జమీన్‌రైతు 24.1.92 సంచిక 4 పేజీ 'బహిరంగ వేలం' ప్రకటన 11 అయిటంలో శేట్ సోహన్‌రాజ్ శ్రీ పాల్‌కుమార్ పాన్ బ్రోకర్స్ బదులు శేట్ గిరాజ్ పాల్ కుమార్ అండ్ కో అని పొరపాటుగా అచ్చుపడినది. గమనించ ప్రార్థన.

కె.వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు.



## నేటినీతి

(2 పేజీ కొరవ)

సహాయ సహకారాలతో అంకితభావంతో పునర్నిర్మాణాన్ని పూర్తి చేయడం ద్వారాను చంద్రమౌళి గారు మరో రామదాసుగా చరిత్రలో నిలిచిపోయారు.

* * * *

చంద్రమౌళి గారంటె అనాటి కాంగ్రెస్ గ్రూపు రాజకీయాలు నీతులు – అవినీతుల అధ్యాయం గుర్తుకొస్తున్నది.

రెడ్డి–కమ్మ తత్వం ఇటీవల ఎక్కువైందో ఏమో గాని, కొత్తదేమీ కాదు. కొత్తగా వచ్చింది అన్ని కులాలకు అంటు వ్యాధిలా వ్యాపించిన కులతత్వం. ఎన్నికల సమయాలలో అభ్యర్థులను నిర్ణయించేటప్పుడు ఆయా నియోజక వర్గాలలోని కులాల ప్రాబల్యాన్ని బట్టి కులాలను ఆంతరంగికంగా పరిగణనకు, పరిశీలనకు తీసుకునే వారు గాని, బహిరంగంగా ఆ ప్రస్తావన తెచ్చే వారు కాదు. త్రాగుడు సాంఘికంగా ఎంత దురాచారంగా, నేరంగా, సమాజం భావించేదో, కులప్రస్తావన కూడా అంత న్యూన్యతగా అభిప్రాయపడేవారు. అటు వంటిది ఇప్పుడు కులం కోణం నుండి తప్ప ఏ సమస్యనూ ఆలోచించడంలేదు; పరిశీలించడడం లేదు. కులసంఘాలే కాదు, కులం పేరుతో హక్కులకు పోరాడడం, పూర్వం ఎన్నడూ లేనంతగా పేరు వెనుక తమ కుల బిరుదు తగిలించుకోవడం, దాన్నొక గౌరవచిహ్నంగా, గర్వకారణంగా భావించడం జరుగుతున్నది. పూర్వం మాంసం తినేవారే గాని ఎముకలు మెడలో వేసుకునే వారు కాదు ; కాని ఇప్పుడు మాంసం తినడమే కాదు ఎముకలు మెడలో వేసుకుంటున్నారు. దేశం ఆర్థికంగా పురోగమిస్తున్నది గాని, సామాజికంగా తిరోగమనంలో వుంది. ఈ విషయంలో విచ్చిన్నకర స్థాయిని చేరుకుంటున్నది.

స్వాతంత్ర్యానంతరం అధికారానికి వచ్చిన కాంగ్రెస్ మంత్రులు అవినీతికి పాల్పడే కుండడమే కాదు ; ఆశ్రిత పక్షపాతం, అధికార దుర్వినియోగమన్నా భయపడే వారు. ఒక వుద్యోగం, ఒక బస్ పర్మిట్, ఒక రోడ్డు, ఒక ఋణం మంజూరు వంటి అల్ప స్వల్ప విషయాలకు కూడా మంత్రులు తీవ్రమైన విమర్శలకు గురికావలసి వచ్చేది. మద్రాసు శాసనసభ్యులుగా వుండిన మంతెన వెంకటరాజు, అన్నాప్రగడ కామేశ్వరరావు వంటి వారు ఏవో చిన్న చిన్న పనులకే విమర్శలకు గురయ్యారు. ప్రకాశం పంతులు గారు కొందరు కాంగ్రెస్ మంత్రుల మీద శాసనసభలో ఒక చార్జిషీట్ పెట్టారు. ఆ ఆరోపణలకు గురియైన వారిలో బహుశా చంద్రమౌళిగారు కూడా వుండినారు ; నిప్పులాంటి బెజవాడ గోపాలరెడ్డి కూడా మినహాయింప బడలేదు. పేలవమైన ఆరోపణల విచారణకు అప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడు పండిట్ నెహ్రూ విచారణ జరిపించగా వాటిలో సత్తా ఏమీ లేదని తేలినది. అప్పుడు నీతి పాలు ఎక్కువ, అవినీతి పాలు తక్కువ. ఇప్పుడు ఆ పరిస్థితి తలక్రిందులైంది. అప్పుడు అవినీతి పరుల క్రింద భావింపబడేవారు గింజలను ఏరుకతినే పిచ్చుకలతో సమానం ; ఇప్పుడు, గొర్లను పీక్కుతినే తోడేళ్ళు (?) కూడా అవినీతి పరుల క్రిందలెక్క బడడం లేదు. మన కళ్ళముందే ఇంత తేడా !

–శ్రీరామమూర్తి

## శివారెడ్డి పద్యాలు

### రిపబ్లికు డే

ఏమి నోము నోస్తి ఎంతపుణ్యంజేస్తి
చూడగలిగ కండ్లో నేను నిన్ను
అంత కంటె భాగ్యమేముంది యేదుంది
ఎక్కడుంది కవికి యిహము పరము !

ఆ మహాత్మగాంధీ నర్చించి పూజించి.
తల్లి యిందిరమకు తలను మోడ్చి
నెహ్రూ వీరగాథ నెమరేసి తెలుగోడా
ముందుకెయ్యర అడుగు ముక్తి భుక్తి !

కవిని సెప్పుమరిచ కాంగ్రెసు నీ సేవ!
అంత యింత గాదు అగణితమ్ము
భారతీయదాస్యబంధ విముక్తికి నీవు
పడ్డశ్రమలు

అయిపోయింది టైము అడదాకా బొయ్యి
వెంటెతిరిగి వస్త వెల్లడిస్త
కాంగీ ! నీ ప్రశస్తి కథ దాకా వినిపిస్తా
తురుము గొడతా బాకా ఐడతా సెలవు !

### వయోజన విద్యా డైరక్టరు

అతి నిగర్వివీవు అడంబరము లేని
సాధికారివీవు, సద్గుకోండి
ఎక్కువైతే చేరు పొక్క పద్యం వ్రాశ
వెంకటరెడ్డి ! సెలవు వెళ్ళి వస్తా !

### కుక్కపిల్లలు

పెంచుతారు కుక్కపిల్లల్ని వున్నోరు
పరుపుదిండు లేసి పండ బెట్టి
కండ్లు బడితె మనిషి కస్సుబుస్సంటారు
ఏమి కారణమ్ము యిందు వలన !

తిండిబెడితె నరుడు తిని తాను
మూపూటలు
కాఫీ ఇస్తె త్రాగి రేపు మాపు
వెన్ను పోటు పొడిచి తిన్నింటి వాసాలు
లెక్కబెట్టు, వున్న చిక్కు యిదిరా !

### ఆటపాటలు, అందచందాలు

ఆటపాటలన్న అందచందాలన్న
అరవరాని మోజు ఆశ నాకు,
నడిచి వెళ్ళ వాడ్ని నడిరేయి వెల్దార్లో
పిక్చరంటె ! యెచ్చ పిచ్చి కవికి !
ఎందువలన నీవు ఈ మధ్య సినిమాల
కెళ్ళడంలా ? పేచి ఏదో వుంది !
ముస్లి ముతక కార్లు ముందుకొచ్చేస్తుంటె
చిందులేస్తు వుంటె సిగ్గుబొయ్యి !

## పంచాంగము

### ముహూర్తములు

తేది 5 బుధవారము ఉదయం గంట 11.20 లకు మేషలగ్నమున వ్యాపారారంభ, గృహారంభ, ఉపనయన వివాహములుకు

రాత్రి గంట 1.00 లకు వృశ్చికలగ్నమున గృహప్రవేశ వివాహములకు

తేది 6 గురువారము ఉదయం గంట 8.08 లకు కుంభలగ్నమను గృహారంభ వివాహములకు

### ఫిబ్రవరి నెల తిథులు

పుష్య బహుళ

తేది 1 శని త్రయోదశి రా. గ. 7.11 వ
తేది 2 ఆది చతుర్దశి రా. గ.9.16 వ
తేది 3 సోమ అమావాస్య రా.గ.11.20 వ

మాఘ – శుద్ధ : –

తేది 4 మంగళ పాడ్యమి రా. గ. 1.30 వ
తేది 5 బుధ విదియ రా. గ. 3.24 వ
తేది 6 గురు తదియ రా.గ. 4.50 వ
తేది 7 శుక్ర చతుర్థి రా.గ. 5.20 వ

స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఏ

## విశ్వేశ్వర శాస్త్రి

(4 పేజీ కొరవ)

హరివంశము నందలి ప్రభావతీ ప్రద్యుమ్నుల చరిత్ర దీనికి మూలము. తృతీయాంకమున అంతర్నాటకంలో విదూషకుని మాటలలో సందర్భోచితమైన మార్పు చేశారు.

**పార్వతీ పరిణయం గ్రంథం**

శ్రీ బట్టబాణ సంస్కృతికి అనువాదం. దన చోపులశ్రె శాస్త్రిగారు ఇందు కొన్ని మార్పులు చేశారు. మూలములోని పార్వతి ఉరోజవర్ణన అనుచితమని భావించి, అనువాదంలో తొలగించారు. ఇక ఆంధ్రనక్షత్రమాల గ్రంథం శివరామ త్రిపాఠి కృత సంస్కృత కావ్యానికి అనువాదం. ఇందులో 31 సంస్కృత వ్యాకరణ పరిభాషలు, రాధాకృష్ణ ప్రేమను గూర్చి విశదం చేసినట్లు వ్రాయబడ్డాయి. పరిభాషా వివరణాన్ని ఇందు సులభంగా రచించడం గొప్ప విషయం. వీరు వ్రాసిన **శ్రీమదాంధ్ర అధ్యాత్మ రామాయణం** వచన కావ్యం. బాలకాండ మొదలు ఉత్తర కాండ వరకు గల ఏడు కాండల రామాయణ విషయాన్ని సరసంగా వివరించారు. రామావతారతత్వాన్ని ఇందు విశదం చేశారు. ప్రతిసర్గ చివర ఆత్మతత్వాన్ని పలు రీతుల విస్తరించారు.

**కాళిదాసు కవితా వైభవమనే** గ్రంథం నాల్గు భాగాలుగా వెలువడింది. మొదటి మూడు భాగాలలో కాళిదాసు కావ్యాలలోని అంశాలను, నాల్గవ భాగంలో నాటకాంశాలను వివరించారు. ఇది వారి చివరి రచన. ఉపమాన ఉపమేయాలు ధర్మ వాచక నిరూపణలకై పలు అలంకార శాస్త్ర గంథాలను పరిశీలించారు. సుప్రసిద్ధ వ్యాఖ్యాతయైన మల్లినాథుని కూడా కాదని వారి ప్రయోగాలు కూడా పరిశీలించి సంస్కరించిన వారు కాళిదాసుని కవిసమయాలను ఉపదేశాలను ఉపమాలంకార భేదాలను విశదీకరించారు. పీఠికలో కాళిదాసుని జీవిత చరిత్రను, కాలనిర్ణయాన్ని, రచించిన కావ్యాల లోతుపాతులను స్పష్టం చేశారు. కావ్యాలలో ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశాల ప్రాముఖ్యాన్ని పేర్కొన్నారు. కాళిదాసుని ప్రకృతి సౌందర్య వర్ణనలో తపోవనాలు, అరణ్యాలు, సరస్సులు, మృగాలు, పక్షులు, ఎన్ని రూపాలను సంత రించుకొన్నవో చర్చించారు. మానవ శరీరావయవ సౌందర్యాన్ని కాళిదాసు పూలతో, తీగలతో, కొమ్మలతో, చిగురుటాకులతో పోల్చి భావకవిగా పాఠకుల హృదయాన్ని హత్తుకొన్న విధానాన్ని బాగా వివరించారు. ఉపమానోపమేయములను ఏ విధంగా గ్రహించాలో వాటి నిర్దేశక సూత్రాలను విశదం చేశారు.

శాస్త్రిగారు 15 సంవత్సరాలు సూర్యరాయ ఆంధ్ర నిఘంటు కార్యాలయంలో పని చేసి, నిఘంటు నిర్మాణానికి తోడ్పడ్డారు. తరువాత మద్రాసు విశ్వ విద్యాలయం వారి విద్వాన్ పరీక్షలో ఉత్తీర్ణులై కొంతకాలం భాషాపండితులుగా తిరుపతిలో, తరువాత నెల్లూరు వి.ఆర్. కళాశాలలో 22 సంవత్సరాలు ఆంధ్రోపన్యాసకులుగా, ఆటుపై వాకాడు ఆర్ట్స్ కళాశాలలో పనిచేశారు. నెల్లూరు జిల్లాలో అపారశిష్యవర్గం వారికి ఉంది. అట్టి మహనీయులు జనవరి 19 తేది ఒంగోలులో దివంగతులయ్యారు. వారు లేని లోటు సాహితీ లోకానికి తీరని నష్టం.





## అపరాలు

(4 పేజీ కొరవ)

పల్లాకు తెగులును తట్టుకొంటుంది

**సస్యరక్షణ :** ఈ పైర్లకు ముఖ్యంగా పచ్చనల్లి, కాయతొలు చుపురుగు, బూడిద తెగులు, పసుపు పొడ తెగులు, వేరు కుళ్ళు తెగులు వస్తూంటాయి.

**పచ్చనల్లి :** ఆకుల నుండి రసమును పీల్చి వేయుటవలన పట పాడయి దిగుబడి తగ్గును. దీని నివారణకు డైమిథోమేట్ ( 2మి.లీ / లీ. నీటికి ) లేదా మానో క్రోటోఫాస్(1.5మి.లీ / లీ )ను పిచికారి చేయాలి.

**కాయ తొలుచు పురుగు :** కాయలను తొలచి పంటకు నష్టాన్ని కలుగ జేస్తుంటాయి. ఈ పురుగు నివారణకు ఎండో సల్ఫాన్ ( 2 మి.లీ / లీ. నీటికి ) లేదా క్వినాల్‌ఫాస్ ( 2మి.లీ / లీ. నీటికి ) లేదా ఎసిఫేట్ (1 గ్రా / లీ. నీటికి ) పిచికారి చేయాలి.

**బూడిద తెగులు :** ఆకులు, మొక్కలపై తెల్లటి బూడిద రంగు లో బూజు వ్యాప్తి చెందును. ఈ తెగులు నివారణకు నీటిలో కరగు గంధకపు పొడిని కాని ( 3 గ్రా / లీ. నీటికి ) లేదా కెరథాన్ (1 గ్రా / లీ. నీటికి ) లేదా కార్బన్‌డిజమ్ ( 1 గ్రా / లీ. నీటికి ) లేదా థయోఫోనేట్ మిథైల్ ( 1 గ్రా / లీ. నీటికి ) ద్రావణాన్ని పిచికారి చేయాలి.

## సినిమా

7 పేజీ కొరవ)

ఇందులో నటించేందుకు ఇద్దరు బడాహీరోలను ఎన్నుకున్నాడు దర్శకుడు. ఒకతను కేరళ హీరో మమ్ముట్టి, దేవరాజ్‌గా నటించాడు. రెండో అతను తమిళ హీరో రజనీకాంత్. సూర్య పాత్రను పోషించాడు. మాజీ యం.ఎల్.ఏగా హిందీ విలన్ అమ్రిష్‌పురి నటించాడు. ఈ బడానటుల బదల్ బుదల్ వల్లనే చిత్రం కాస్త నిలబడుతుంది.

### మామా అల్లుడి సవాల్

"భారత్ బంద్ " చిత్రంలో దర్శకుడు కోడి రామకృష్ణ ముప్ఫయ్ శాతం వాటాదారుడైతే, నిర్మాత అయిన ఆయన మామ సుభాష్ 70 శాతం వాటాదారుడు. చిత్రం శతదినోత్సవం జరుపుకుంది. బాగా లాభాలు వచ్చాయి. తమిళ డబ్బింగ్ హక్కులు 10 లకారాల కన్నా ఎక్కువగానే అమ్ముడు పోయాయి. కాని, నిర్మాతకు మిగిలింది సున్నా. "మా అల్లుడే నన్ను మోసం చేస్తాడని అనుకోలేదు. చిత్రం నిర్మాణంలో వుండగానే ఆయన రంగులు మారుతూ వచ్చాయి. బడ్జెట్ అనుకున్నదాని కన్నా ఎక్కువైతే సొంత డబ్బు తీసుకొచ్చి పెట్టాను. తమిళ డబ్బింగ్ హక్కులు నేను చెప్పిన వ్యక్తికి కాక ఆయన మరెవరికో ఇచ్చాడు. మా అమ్మాయిని చూచి పూరుకున్నా. ఆఖరికి శతదినోత్సవాన్ని నా ప్రమేయం లేకుండా ఆయనే ఏర్పాటు చేశారు. అప్పుడు మరికొన్ని బాకీలు నేనే చెల్లించ వల్సి వచ్చింది. ఆ నూరునాళ్ళ ముచ్చటకు వెళ్ళకపోతే బాగుండదని నేనె వెళ్ళాను. ఇంత అన్యాయం జరిగాక ఇక ఎందుకు ఊరికే వుంటాను ? న్యాయశాస్త్ర రీత్యా చర్య తీసుకుంటాను. " అన్నారు నిర్మాత సుభాష్. "మా విబేధాలు బహిరంగం చేయడానికి నా కిష్టం లేదు. ఆయనేం చేసుకుంటారో చేసుకోనివ్వండి ", అంటారు కోడి రామకృష్ణ.

కోడి రామకృష్ణ దర్శకత్వంలో నెల్లూరీయుడు బి.వెంకటసుబ్బయ్య ఎంతో ఖర్చు చేసిన "విముక్తి " చిత్రం ఎప్పుడో షూటింగ్ పూర్తి చేసుకుంది. ఎప్పుడు విడుదలవుతుందో, ఎందుకింత ఆలస్యమో ఆ భగవంతుడికే తెలియాలి.

### షావుకారు జానకి షష్టిపూర్తి

షావుకారు జానకి తొలిసారిగా నటిస్తున్న మలయాళ చిత్రం "సూర్యవంశం" . ఈమె సరసన మమ్ముట్టి నాయకుడు. ఊనూరులో ఈ చిత్రం ఔట్ డోర్ షూటింగ్ జరుగుతున్నప్పుడు ఆ యూనిట్ లోని వారు ఈమె జన్మదినోత్సవాన్ని ఘనంగా జరిపారు. "నా పుట్టిన రోజును మద్రాసులో జరుపుకోవడం మామూలు. రజనీకాంత్ ప్రతిసారి ఫోన్‌లో శుభాకాంక్షలు తెలియజేస్తే, కమలహాసన్ పుష్పగుచ్ఛాన్ని పంపిస్తూంటారు అంతే. ఇతరులెవ్వరూ పట్టించుకోరు " అంది జానకి.


**జమీన్‌రైతు**
సంవత్సర చందా రూ.75/-
అర్థ సంవత్సర చందా రూ. 40
విడిప్రతి 1.50

# విజయమహల్ బ్రిడ్జి పార్టీ సమస్య కాదు!

విజయమహల్ గేటు వద్ద బాక్స్ టైపు బ్రిడ్జి నిర్మాణానికి రైల్వే శాఖ అంగీకారం తెల్పిందని, మునిసిపాలిటీ వెంటనే 30 లక్షలు చెల్లిస్తే నిర్మాణాన్ని సంవత్సరం ఆఖరులోగా పూర్తి చేయగలమని వ్రాశారని, అందువల్ల ఆ మొత్తాన్ని మునిసిపాలిటీ వెంటనే చెల్లించాలని సి.పి. ఎంటవున్ కార్యదర్శి శ్రీ నారు కృష్ణయ్య, కౌన్సిల్‌లో సి.పి.ఎం. పక్షనాయకుడు శ్రీ ఉన్నంబసవయ్య కోరుతున్నారు.

ఈ బ్రిడ్జి సౌకర్యం కోసం మార్క్సిస్టు పార్టీ ఒక్కటే కాదు, అందరూ ఆందోళన చేశారు; మునిసిపల్ కౌన్సిల్ తీర్మానించింది. అటువంటప్పుడు ఈ పనిని మార్క్సిస్టులు తమ ఖాతా క్రింద జమ కట్టుకోవడం ఏమి భావ్యం ? కౌన్సిల్‌లో ఒక పార్టీ నాయకుడుగా వున్న శ్రీ బసవయ్య 30 లక్షలు చెల్లింపుకు కౌన్సిల్‌లో తీర్మానం పెట్టి, కట్టించే కృషి చేయకుండా పత్రికల ద్వారా మునిసిపాలిటీకి విజ్ఞప్తి చేయడం: ఎంత వరకు సమంజసం ? రాజకీయాలకు అతీతమైన ప్రజా సౌకర్యాలివి. వాటికి రాజకీయ రంగులేకుండటం బాగుంటుంది

ఆ బ్రిడ్జి లేనందువల్ల నిత్యం వేలాది మంది పౌరులు ఇబ్బందుల పాలవుతున్నారు. మునిసిపాలిటీ ఆ మొత్తాన్ని చెల్లించి, వర్షాకాలం వచ్చేలోగా నిర్మాణం పూర్తి అయ్యేట్లు కృషి చేయడం అవసరం.

## వేదం జయంతి

వేదం వెంకట రాయ శాస్త్రిగారి జయంతి సభ వర్తమాన సమాజా ధ్వర్యంలో జరిగింది. శ్రీ ఎం. సుందరాచారి అధ్యక్షించారు. డాక్టర్ ఉడాలి నరసింహ శాస్త్రి వెంకట్రాయ శాస్త్రి గారి సాహిత్యం పై ప్రసంగించారు. శ్రీ ఆగస్త్య రెడ్డి, వెంకురెడ్డి వందనాలు చెప్పారు.

## శ్రీరామచంద్ర మూర్తి ఎందుకయ్యారు ?

శ్రీ రామచంద్ర మూర్తి వ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా ఎరిగిన వాల్మీకి మహర్షి మునీంద్రుడైన నారదుని ప్రశ్నించాడట. మహానుభావునిగా పూజింపబడేందుకు విశిష్టమైన పదహారు గుణములు గలవాడెవారు ? అంటూ. దానికి నారదుడు ఒక్క క్షణం ఆగు ! కొంచెం బాగా ఆలోచించాలి అని, వ్యవధి తీసుకుని, ఆ మహోన్నత వ్యక్తి శ్రీ రామచంద్రుడే అని సెలవిచ్చారట.

సుగుణవంతుడు, ధర్మమూర్తి, పరాక్రమశాలి, సామర్థ్యమున్న వాడూ శ్రీ రాముడేనని సకారణంగా, సోదాహరణంగా వాల్మీకికి వివరిస్తాడు నారదుడు. చంద్రుని షోడశ కళల వలెనే మహోన్నతమైన, మానవీయమైన పదహారు గుణాలు కలవాడు గనుకనే రామునికి శ్రీ రామచంద్రమూర్తి అనే పేరు కలిగిందని రామయణాన్ని ఔపోసనం పట్టిన శ్రీ మైలవరపు శ్రీనివాసరావు గారు వివరించారు.

ఆయన రేబాల పట్టాభిరామిరెడ్డి గారి 81 వ జయంతి ఉత్సవ సందర్భంగా మాట్లాడారు. ఆయన ప్రసంగం ఒకటిన్నర గంట సేపు, ఆపాత మధురంగా, అమృత ధారగా సాగింది. సంస్కృత శ్లోకాలు ఆయన నోట పనస, తేనెలవలె వుండి శ్రోతలను మంత్ర ముగ్ధులను చేశాయి. ఆహూతుల సంఖ్య షరా మామూలే; అతి తక్కువ. అయినా అందులో ఏదో తెలియని పవిత్ర

## సింహపురి

వాతవరణం గోచరించింది. అధ్యక్షత వహించవలసిన శ్రీ దుగ్గాట్టి వెంకట రమణయ్య రాక పోతే నిరాధ్యక్షంగానే జరిగి పోయింది. సభాకార్యక్రమ భారాన్నంతా వర్తమాన సమాజం కార్యదర్శి శ్రీ అగస్త్య రెడ్డి వెంకురెడ్డి గారే మోశారు.

స్వర్గీయ రేబాల పట్టాభి రామరెడ్డి గారి 87 వ వర్ధంతి సందర్భంలో జరిగిన సభ ఇది. ఆయన పతిమణి శ్రీమతి సుజాతమ్మ గారి పక్షంగా శ్రీనివాసరావు గారికి సన్మానం జరిగింది.

## అంగవికలుర మొర ఇప్పుడైనా వినండి!

నెల్లూరు వికలాంగుల సహకార సంస్థ వుద్యోగులు తమ కోర్కెల సాధన కోసం 24 తేది నుండి పెద్దాస్పత్రి ముందు గుడారం వేసుకొని రిలే నిరాహారదీక్ష సాగిస్తున్నారు. ఉద్యోగాలను పర్మినెంటు చేయడం మొదలు కొత్త నియామకాలు నిలిపివేయాలనే వరకు మొత్తం కోర్కెలు పది. మా మొర ఇప్పుడైనా వినండి బాబూ అంటూ ప్రభుత్వాన్ని వేడుకుంటున్నారు.

ఎదుగుబొదుగు లేని జీతాలు ; పర్మినెంట్ కాని వుద్యోగాలు; సంవత్సర సంవత్సరానికి తగ్గిపోతున్న ప్రభుత్వ కేటాయింపులు చాలినంతపని లేక పోవడం.... ఈ సమస్యలతో వారు సతమతమై పోతున్నారు. ఐదేళ్ళ తర్వాత కూడా నెలకు ఎనిమిది వందల రూపాయల జీతం అంటే ఈ ఖర్చు రోజుల్లో జీవితం గడిచేదెట్లా? నెల్లూరు అంగవికలుర సహకార సంఘానికి శ్రీ పి.సి.రెడ్డి గారు దాతలను పట్టుకొని 60 ట్రైసైకిల్సు తయారీ పని ఇప్పించి సహాయపడ్డారట. ఇప్పుడు పనేమీలేదట.

మొదలే అంగ వైకల్యంతో మానసికంగా కృంగిపోయేవారికి, వారు చేయదగిన పని కల్పించి ఆదుకోకుంటే బ్రతుకు దుర్భరం కాదా ? నిరాహార దీక్షలను ఎవ్వరూ ప్రోత్స హించరు; అందులో రిలే నిరాహార దీక్షలంటే హేళనగా మారిపోయాయి. కాని ప్రభుత్వం వీరిని ఆదుకోవడం మాత్రం అవసరం.

## జాగృతి క్విజ్ పోటి

పర్యావరణ సమతౌల్యం పరిరక్షణకై తన వంతు కృషి చేస్తున్న 'జాగృతి' సంస్థ నెల్లూరులో కాలేజి, స్కూలు విద్యార్థులకు క్విజ్, వక్తృత్వ పోటీలు నిర్వహించనుంది. సాధారణ ప్రజలకు కూడా నినాద రూపకల్పన, పోస్టర్ చిత్రీకరణ, ఫొటోగ్రఫీలలో పోటీలు జరిపించనున్నారు. ఆసక్తి గల వారు జాగృతి, 3/62, నవాబుపేట, నెల్లూరు -2 అన్న చిరునామాకు ఫిబ్రవరి 20 తేది లోగా వ్రాసి వివరాలు పొందవచ్చు.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.